# I HAVE 14 BEST FRIENDS TO HELP ME TOP MY CLASS










Apsara Drawing Pencils come in 14 grades and help me in so... so many subjects. My classmates also include Apsara Poster Colours, Water Colour Tubes, Oil Pastels and Wax Crayons. All, toppers.



**Apsara®**
DRAWING PENCILS

For information, write to:
**Hindustan Pencils Limited,**



# చందమామ

ఆగస్టు 1990



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00

# RAMBO IV



No more evil, injustice and crime will be tolerated in this city. The relentless crusader is here. With his famed Zap Gun (the three sound gizmo that's the terror of the underworld) and his fleet of rough 'n tough ready-for-action vehicles — Wrecker, Super Dumper and Fire Engine. And of course, his missile-firing Helicopter. So...breathe easy. The one man army is here.

**SAMMO**

Mechanical and electronic toys









**CHANDAMAMA TOYTRONIX**

In collaboration with Sammo Corporation, S.Korea

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, 188, NSK Salai, Vadapalani, Madras 600 026

Mudra:M CTPL:4093

# చందమామ

స్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## నలభై మూడేళ్ళ స్వాతంత్ర్యం!

మహోన్నతమైన ప్రాచీన సంస్కృతికి ప్రసిద్ధిగాంచిన దేశం మనది. అయినా, ఈనాటి మన పరిస్థితి ఎలా ఉన్నది? మన దేశంలో విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానానికి కొరతలేదు. సాంకేతిక నైపుణ్యానికి లోటు లేదు. మేధావంతులయిన మన యువకులెందరో, దేశవిదేశాలలో తమ అపురూపమైన శక్తిసామర్థ్యాలను రుజువు చేస్తున్నారు!

మన రాజ్యాంగచట్టం దేశ పౌరులందరికీ సమానమైన అవకాశాలనూ, హక్కులనూ కల్పిస్తున్నది.

ఇక ప్రకృతివనరుల విషయానికివస్తే—ఇతర ప్రపంచ దేశాలతో పోల్చినప్పుడు మనదేశం జీవనదులతో, సారవంతమైన భూములతో, ఖనిజ సంపదలతో ఎంతో సంపన్నమైన దేశం!

ఇన్ని ఉన్నా మన జాతి జీవనం సవ్యంగా సాగకపోవడానికి కారణం ఏమిటి? స్వాతంత్ర్యం సిద్ధించి నలభైమూడేళ్ళు దాటినా, మనం ఆశించినంతగా అభ్యున్నతి సాధించకపోవడానికి కారణం ఏమిటి? రోజు రోజుకూ హింసాకాండ ఎందుకు పెరిగిపోతున్నది? మనలో ఉన్న లోపం ఏమిటి?

ముఖ్యంగా మనలో క్రమశిక్షణలేదు; సామాజిక దృష్టిలేదు. మితిమించిన దురభిమానం, దురహంకారం, కన్నుగానని స్వార్థపరత్వం పెరిగిపోయి నిజాయితీకి నిలువ నీడ లేకుండా చేస్తున్నవి.

ఈ తిరోగమన శక్తులనుంచి బయటపడాలంటే—ఈ స్వాతంత్ర్య దిన సందర్భంగా ప్రతి ఒక్కరూ ఆత్మపరిశీలన చేసుకుని లోపాలను సరిదిద్దుకుని అభ్యుదయమార్గంలో పయనించాలి!

సంపుటి 87    ఆగస్టు '90    సంచిక 2

విడి ప్రతి : 3-00    : :    సంవత్సర చందా : 36-00






## వార్తలు–విశేషాలు :

# శ్రీలంక సంఘటనలు

శ్రీలంక ప్రాచీన చరిత్రను తెలియజేసే 'మహావంశ' గ్రంథంప్రకారం— తూర్పు భారతదేశానికి చెందిన విజయసింహుడనే యువరాజు, ఏడువందలమంది అనుచరులతో నూతన తీరాలు అన్వేషిస్తూ వెళ్ళి శ్రీలంకను చేరాడు. అక్కడి కొండజాతి యువరాణితో మైత్రి కలుపుకుని నూతన రాజ్యంస్థాపించాడు. కొన్నాళ్ళకు ఆమెను వదలి, దక్షిణ భారతదేశంలోని మధురై పాండ్యరాజ కుమార్తెను వివాహమాడాడు. విజయ









సింహుడి అనుచరులు కూడా మధురై నుంచి వచ్చిన ఏడువందలమంది కన్య లను పెళ్ళాడారు. వారి సంతతికి చెందినవారే ఈనాటి సింహళులు. విజయసింహుడి పేరు మీదుగానే ఆ ద్వీపానికి 'సింహళం' అనే పేరు ఏర్ప డింది. కాని, అంతకుముందే దానికి 'లంక' అనే పేరు ఉండేదని రామా యణం ద్వారా తెలుస్తున్నది.

దక్షిణ తమిళనాడు సముద్రతీరానికీ, లంకకూ మధ్య దూరం ఇరవైమైళ్ళే. ఆ కారణంగా, క్రమంగా తమిళనాడు దక్షిణ ప్రాంతం నుంచి ప్రజలు లంకకు వలసపోసాగారు. 11వ శతాబ్దంలో చోళ వంశపు రాజులు దాదాపు 80 సంవత్స రాలు లంకను పరిపాలించారు. 19వ శతాబ్దంలో తేయాకు తోటలలో పని చేయడానికి చాలామంది తమిళులు తరలివెళ్ళి లంకలో స్థిరపడ్డారు.

శ్రీలంక తమిళులు భిన్న సంస్కృ తులు కలిగివున్నారు. శ్రీలంక ఉత్తర ప్రాంతమైన జాఫ్నా ప్రాంతం తమిళు లకు తగిన న్యాయం జరగడం లేదన్న అసంతృప్తి చాలా కాలంగానే వున్నది. సింహళులకు శ్రీలంక ప్రభుత్వంఆదరణ ఉండేది. ఆ ప్రభుత్వం తమిళులపట్ల పక్షపాత వైఖరితో వ్యవహరించేది. ఇటీ వలి కాలంలో తమిళుల బాధలు పెరిగి పోయి, అవి తిరుగుబాటుకు దారి తీశాయి. అనేక తమిళ ఉగ్రవాదవర్గాలు ఏర్పడి, తమిళులకంటూ ప్రత్యేక దేశం కావాలని,సాయుధపోరాటానికి దిగాయి. అయినా, జాఫ్నా విభజనకు ప్రపంచ దేశాల మద్దతు లభించలేదు. ఈ కాల ఘట్టంలో భారత ప్రభుత్వం జోక్యం కల్పించుకుని—తమిళ ప్రాంతాలకు ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించి, స్థానిక స్వపరిపాలనకు ఏర్పాటు చేసింది. ఈ ఏర్పాటు అధిక సంఖ్యాకులయినతమిళు లకు ఆనందం కలిగించింది. భారత శాంతిరక్షక దళాల పర్యవేక్షణలో ఎన్ని కలు జరిగాయి. స్థానిక ప్రభుత్వం కూడా ఏర్పడింది!

అయినా, ఎల్.టి.టి.ఇ. అనే బల మైన ఉగ్రవాద వర్గం ఎన్నికలను వ్యతి రేకించి, బహిష్కరించింది. జాఫ్నా అధి కారం తన కైవసం కావాలనీ, తన నాయ కత్వాన్ని వ్యతిరేకించిన వారినందరినీ నిర్దాక్షిణ్యంగా హతమార్చసాగింది. ఆఖరికి, భారతదేశంలో తలదాచుకున్న ప్రత్యర్థివర్గ నాయకులను సైతం, ఇక్కడే ఘోరంగా కాల్చిచంపింది!

శ్రీలంక తమిళుల క్షేమంపట్ల మన దేశం ఎంతో సానుభూతితో వ్యవహరిస్తు న్నది. తమిళులందరి క్షేమాన్నీ కాంక్షిస్తు న్నది. అంతేగాని, ఎలాగైనా తమిళజాతి నాయకత్వం తమకు మాత్రమే దక్కా లని, సాయుధ పోరాటం సాగిస్తూన్న ఒక్క ఉగ్రవాద వర్గానికి మాత్రమే మద్దతు ఇవ్వడం సాధ్యం కాని పని!

శ్రీలంక ప్రభుత్వమూ, ఎల్.టి.టి.ఇ. ఉగ్రవాదవర్గమూ కోరినమీదటే భారత శాంతిసేన లంక నుంచి వెనుదిరిగింది. అయితే, ఆ తరవాత అక్కడ ఉభయ పక్షాల మధ్య మళ్ళీ యుద్ధం ప్రారంభ మయింది. తత్ఫలితంగా శాంతి ప్రియు లైన సామాన్య ప్రజలు ఘోరమైన బాధ లకు బలి అవుతున్నారు!



# అమాయకుడి గడుసుదనం

కాంచనపల్లి గ్రామంలో వుండే వ్యాపారి వెంకటపతికి, రామం ఒక్కడే కొడుకు. అందరూ అతణ్ణి గడుసుదనమూ, లౌక్యమూ తెలియని అమాయకుడని అంటూండేవారు.

ఒకసారి వాడి తండ్రి కోపం కొద్దీ, "ఒరే, రామం! మరీ ఇంత లౌక్యం తెలియనివాడివైతే ఎలారా? రూపంలో మేనమామ పోలిక వచ్చినందుకు, గుణంలో కూడా మీ మేనమామ లౌక్యమూ, తెలివితేటలూ అబ్బవద్దూ," అన్నాడు.

రామం మేనమామ జగన్నాథాన్ని అందరూ మహాలౌక్యుడనీ, వ్యవహార జ్ఞానం బాగా వున్నవాడనీ అంటారు. తండ్రి కూడా ఆ మాటే అనగానే, రామానికి మేనమామ గురించి తెలుసుకోవాలనిపించింది.

ఒకనాడు రామం తండ్రి అతణ్ణి పిలిచి, "మీ మామయ్య వున్న ఊరుకు నాలుగామడల దూరంలో వున్న ఈదుపల్లెలో చింతపండూ, మిరపకాయలూ కారుచౌక అన్న సంగతి, నీకు తెలుసుగదా. నువ్వు వెంటనే బైలుదేరి వెళ్ళి మీ మామయ్య సరుకు ఇంకా ఎందుకు పంపలేదో కనుక్కుని, మిరపకాయలు మామూలుకన్న అదనంగా మరొక రెండు బస్తాలు కావాలని చెప్పు. ఒకవేళ ధరలు పెరిగాయో ఏమో, మరికొంత డబ్బు తీసుకువెళ్ళు," అని చెప్పి, డబ్బిచ్చి పంపాడు.

రామం మేనమామ ఊరు చేరేసరికి కనుచీకటి పడుతున్నది. ఇంటి ముందు గదిలో దీపం వెలుగులో, ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చున్న మరదలు ఉష అతనికి కనిపించింది. రామం వచ్చిన

లక్ష్మిగాయత్రి



ఉష ఆమెను చూస్తూనే సాదరంగా ఎదురువెళ్ళింది. వృద్ధురాలు ఆమెను, "అమ్మవచ్చిందా, ఉషా?" అని ప్రశ్నించింది.

"లేరు, మామ్మా! మరి కాసేపట్లో వస్తుంది. ఏం కావాలి?" అని అడిగింది ఉష.

వృద్ధురాలు ఒక్క క్షణం రామం కేసి తటపటాయిస్తున్నట్టు చూసి, "ఊరు నుంచి లక్ష్మివాళ్ళు వచ్చారు. ఇంట్లో పంచదార బొత్తిగా నిండుకున్నది," అన్నది నసుగుతూ.

"అంతేగదా! పంచదార నేనిస్తాలే," అంటూ ఉష లోపలికి వెళ్ళింది.

అలికిడి వింటూనే, ఆమె పుస్తకం పక్కనపెట్టి, చిరునవ్వునవ్వుతూ, అతణ్ణి కుశలప్రశ్నలు అడిగింది.

రామం జవాబులు చెబుతూనే ఇల్లంతా కలయజూస్తూ, "ఇంట్లో ఎవరూ లేనట్టున్నారు. బైటికి వెళ్ళారా, ఉషా?" అని అడిగాడు.

"అవును, బావా! తెలిసినవారింటి పెళ్ళికి అందరూ వెళ్ళారు. కాసేపట్లో వచ్చేస్తారు," అన్నది ఉష.

ఆ తర్వాత రామం స్నానం చేసి, ఉష పెట్టిన ఫలహారం తింటూండగా, వీధి తలుపు తీసుకుని, ఒక వృద్ధురాలు లోపలికి వచ్చింది.

వృద్ధురాలు తన చిరుగుల చీరకొంగును సర్దుకుంటూ, ఉషతోబాటు లోపలికి వెళ్ళే ఓపిక కూడా లేనట్టు అక్కడే చతికిలబడింది.

కొద్దిసేపటి తర్వాత ఉష ఒక డబ్బా నిండుగా పంచదార తెచ్చి వృద్ధురాలికి యిస్తూ, "ఇదిగో, మామ్మా, పంచదార!" అంటూ ఆమె లేవడానికి చెయ్యి అందించింది.

వృద్ధురాలు పంచదార తీసుకుని సంతోషంగా, "నా ఆయుష్షు కూడా పోసుకుని చల్లగా బతుకు!" అని ఉషను దీవిస్తూ వెళ్ళిపోయింది.



జరుగుతున్నదంతా మౌనంగా చూస్తున్న రామం, వృద్ధురాలు వెళ్ళిపోగానే, "మామయ్య ఎంతో గడుసువాడని అంటారు! ఆయన గడుసుదనం నీకు రవ్వంతయినా రాలేదేం, ఉషా? పూటకు దిక్కులేనిదానిలా కనిపిస్తున్న, ఆ ముసలావిడకు అంత పంచదార అప్పుగా ఇచ్చావు. తిరిగి వస్తుందనేనా?" అని ప్రశ్నించాడు.

రామం ప్రశ్నకు ఉష నవ్వుతూ ఏదో చెప్పబోయేంతలో, వీధి తలుపు మళ్ళీ చప్పుడయింది. ఈసారి, ఖరీదైన చీర కట్టుకుని, ఒంటినిండా నగలు అలంకరించుకున్న ఒక లావుపాటి స్త్రీ లోపలికి వస్తూనే, రామాన్ని ఒకసారి ఎగాదిగా చూసి, "ఈ కుర్రాడెవరే, ఉషా?" అంటూ అందుబాటులో వున్న కుర్చీలో కూర్చున్నది.

ఉష ఆవిడ ప్రశ్నకు జవాబు చెప్పేలోగానే, "ఇంతకూ, మీ అమ్మ పెళ్ళి నుంచి వచ్చిందా?" అని ప్రశ్నించింది.

"అమ్మ ఇంకా రాలేదు. మీరేదో పని మీద వచ్చారు!" అన్నది ఉష ముక్తసరిగా.

"రేపు మీ మామయ్య స్నేహితులెవరో వస్తారట! లడ్డూలూ, జిలేబీలూ చెయ్యమన్నారు. ఇంట్లో పంచదార అయిపోయింది. వెధవ మతిమరుపు— దుకాణం నుంచి తెప్పించుదామనుకుంటూ మరిచిపోయాను. ఒక రెండు శేర్ల పంచదార వుంటే చూడవే, అమ్మా!" అన్నదావిడ.

"లేదు అత్తయ్యా! మా ఇంట్లో కూడా పంచదార, ఈ పూటే అయిపోయింది. మా అమ్మ రేపు తెప్పిస్తానన్నది," అంటూ ఉష కూర్చున్నచోటునుంచి లేవకుండానే జవాబు చెప్పింది.

ఉష జవాబు వింటూనే ఆవిడ మొహం మాడ్చుకుని, "సరే అయితే!" అంటూ లేచి ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.



ఆవిడ వెళ్ళిపోగానే ఉష రామం వైపు చూసి నవ్వుతూ, "భగవంతుడు నీ ప్రశ్నకు వెంటనే జవాబు ఎలా పంపించాడో చూశావా, బావా?" అన్నది.

ఉష మాటలు అర్థంకాని రామం ఆశ్చర్యంగా, "నువ్వనేదేమిటి?" అని ప్రశ్నించాడు.

"ఆ ప్రశ్నకు తర్వాత జవాబు చెబుతాను. ముందు నువ్వు నా ప్రశ్నకు సమాధానం చెప్పు. ఇంతకుముందు ఆ ముసలామెకు పంచదార అప్పు యిచ్చానని దెబ్బలాడావు. ఇప్పుడు ఈవిడకు అప్పు ఇవ్వకపోవడం సమంజసమేనా?" అని అడిగింది ఉష.

రామం తల అడ్డంగా తిప్పుతూ, "ఎంత మాత్రం సమంజసం కాదు. ఆ ముసలావిడ కంటే ఈవిడ ధనవంతురాలని తెలుస్తూనే వున్నది. దుకాణాలు మూయకముందే పంచదార తెప్పించుకోవడం మరిచిపోయింది. అందువల్ల, నీ దగ్గరకు అప్పుకురావలసివచ్చింది. రేపు ఉదయాన దుకాణాలు తెరిచాక పంచదార తెప్పించి, నీకిచ్చేస్తుంది. ఇక ఆ ముసలావిడ దగ్గర నుంచి, నీ పంచదార తిరిగి వస్తుందన్న నమ్మకం, నాకేమీ లేదు," అన్నాడు.

"నువ్వు వ్యవహారజ్ఞానం లేని అమాయకుడివని, మామయ్య ఎందుకంటారో ఇప్పుడు నాకు అర్థమైంది, బావా!" అన్నది ఉష నవ్వుతూ.

ఆ మాటలకు రామం ముఖం ముడుచుకుంటూ, "నువ్వు అంత తెలిసినదానివైతే, నాకు తెలియనిదేదో చెప్పరాదూ?" అన్నాడు.

అతడి కోపం చూసి ఉష నవ్వుకుంటూ, "చెబుతా, విను! మొదట వచ్చిన వృద్ధురాలు గతిలేకపోతేతప్ప కానీ సరుకు కూడా అప్పు చెయ్యదు. ఒకవేళ అప్పు చేస్తే, దాన్ని పూర్తిగా తీర్చేదాకా నిద్రపోదు. ఇటువంటివాళ్ళకు అప్పు ఇవ్వడం అంటే, వాళ్ళకు సహాయం చేసినట్టే! ఇక లావుపాటి ఆవిడ లేనిపోని ఆడంబ

రాలకు పోతుంది. చేసిన అప్పులు మరిచి పోతుంది. అడిగితే లేనిపోని గొడవలు లేవదీస్తుంది. ఇటువంటివాళ్ళకు అప్పులు ఇవ్వడం అంటే, కొరివితో తల గోక్కున్నట్టే '' అన్నది.

రామం తల ఊపుతూ, ''అదా సంగతి! అయినా, వాళ్ళను గురించి నీకు తెలిసినట్టు, ఊరికి కొత్తవాణ్ణి నాకెలా తెలుస్తుంది, చెప్పు?'' అన్నాడు, ఉష అన్యాయంగా తన మీద నిష్ఠూరం వేసిందన్న ధోరణిలో.

అందుకు ఉష, ''అక్కడే మన తెలివితేటలు ప్రదర్శించాలి, బావా! నువ్వు మామయ్య దుకాణంలో కూర్చుంటావనుకో, ఎవరెవరో వచ్చి అప్పులూ అరువులూ అడుగుతారు. వాళ్ళందరి గురించీ నీకు ముందే తెలుస్తుందా? వాళ్ళ మాట తీరును బట్టి, ప్రవర్తననుబట్టి, వాళ్ళు ఎటువంటి వాళ్ళో అంచనా వెయ్యాలి. అలా చేయలేకపోతే వ్యాపారంలో దివాలా తీస్తావు. ఇటువంటి తెలివితేటలు వ్యాపారులకూ, గృహస్థులకూ చాలా అవసరం.'' అన్నది.

ఉష వివరణకూ, ఆమె తెలివితేటలకూ ముగ్ధుడైన రామం, ''సఖ్యం సాప్తపదీనాం, అన్న ఆర్యోక్తి విన్నావా, ఉషా?'' అని అడిగాడు.



హఠాత్తుగా అతడు సంభాషణ మార్చడంతో ఆశ్చర్యపోయిన ఉష, ''విన్నాను, ఏం?'' అన్నది.

''మనిద్దరం ఇప్పటికి ఏడడుగులు పైనే కలిసినడిచాం! అంటే, మనిద్దరికీ స్నేహం కుదిరినట్టేనా?'' అన్నాడు రామం.

ఉష ఇంకా ఆశ్చర్యపోతూ అంగీకారంగా తల వూపింది.

''అయితే, నాకు ఇటువంటి వ్యవహార జ్ఞానం తక్కువని తెలిసినప్పుడు, నా జీవిత భాగస్వామివై, నా జీవితాన్నీ, నా దుకాణాన్నీ చక్కదిద్దడం, స్నేహితురాలిగా నీ ధర్మం కాదా?'' అని అడిగాడు రామం.

ఉష అతని మాటలు అర్థం కాక మొదట తెల్లబోయింది. అర్థం కాగానే సిగ్గుపడుతూ... "ఇంత చక్కగా ముందరి కాళ్ళకు బంధం వేస్తున్నవాడివి, నీకు తెలివితేటలు తక్కువని ఎవరన్నారు, బావా? నాన్నను అడుగు," అంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత కొద్దిసేపట్లో జగన్నాథం, భార్యా, కొడుకూ వచ్చారు. రామం, తను వచ్చిన పని గురించి జగన్నాథానికి చెప్పాడు.

"ఈసారి రైతులు సరుకు ఇవ్వడం కొంత అలస్యం చేశారు. ధరల్లో పెద్ద తేడా ఏమీలేదు; ఆ మాట మీ నాన్నకు చెప్పు," అన్నాడు జగన్నాథం.

రామం కాస్త తటపటాయిస్తూ, "అది సరే. నీ దగ్గిరున్న మరొక విలువైనవస్తువు, నాక్కావాలంటే ఇస్తావా, మామయ్యా?" అన్నాడు.

జగన్నాథం, "నా దగ్గిర విలువైన వస్తువున్నదా? ఏమిటది?" అని అడిగాడు.

"అదేమిటో తర్వాత చెబుతాను. ముందు నాకు ఇస్తావా, చెప్పు," అన్నాడు రాముం.

జగన్నాథం నవ్వి, "ఉన్న ఒక్కగానొక్క మేనల్లుడివి. నీకు ఇవ్వరానిదేముంది? అఖరుకు నా కూతుర్ని ఇవ్వమని అడిగినా, సంతోషంగా ఇచ్చేస్తాను. ఏమిటో చెప్పు?" అన్నాడు.

రామం కూడా నవ్వుతూ, "ఉషను మా ఇంటి కోడలుగా పంపించు," అన్నాడు.

ముందు తెల్లబోయిన జగన్నాథం, తర్వాత పెద్దగా నవ్వుతూ, "అమాయకుడివనుకున్నాను, ఇంతకాలం. పెద్ద గడుగ్గాయివి!" అన్నాడు.

ఇంటికి తిరిగి వచ్చిన రామం ద్వారా, సంగతి విన్న అతడి తల్లిదండ్రులు కూడా చాలా సంతోషించారు. "అమాయకుడి గడుసుదనం అంతా, భార్యను ఎన్నిక చేసుకోవడంలో కనిపిస్తుందట! మనవాడు చాలా గడుసువాడే!" అన్నాడు రామం తండ్రి, భార్యతో.






## 12

[జయానందముని ఆశ్రమంలో పెరుగుతూన్న తన కుమారుణ్ణి రాజు శాంతిదేవుడు చూశాడు. నానాటికీ పెరిగిపోతూన్న వీరసింహుడి దురాగతాలను అరికట్టడానికి వసంతుడి నాయకత్వంలో పోరాటం సాగిస్తూన్న సుమేధరాజ్య యువకులను, సరిహద్దు ప్రాంతాలలోని అరణ్యమధ్యానికి నడపమని జయానందముని రాజుకు సలహా ఇచ్చాడు. —తరవాత]

పొరుగు రాజ్యాలపై దండెత్తి అక్కడి సంపదలను దోచుకోవాలన్న వీరసింహుడి కల, కలగానే మిగిలిపోయింది. వీరసింహుడి భటులు అమాయక ప్రజల నుంచి ధాన్యాన్ని దోచుకోవడానికి సుమేధ రాజ్య యువకులు అడ్డుతగిలారు.

తిరుగుబాటు జరిపే యువకుల రహస్య స్థావరాలను కనుగొనడానికి వీరసింహుడూ, సేనాధిపతి కపాలకంతుడూ అనేక విధాలుగా ప్రయత్నించారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఎందుకంటే, ఆ యువకులందరూ అరణ్యంలో ఒకేచోట కాకుండా వేరువేరు స్థలాలలో దాగి వుండేవారు. నిర్ణీత సమయాలలో ఒక అందమైన లోయ వద్ద కలుసుకునేవారు. చుట్టూ కొండలతో, అక్కడక్కడ సన్నటి సెలయేళ్ళతో ఆ ప్రాంతం చిన్న లోయలాగా కనిపించినప్పటికీ నిజానికి అది



లోయ కాదు. మధ్య విశాలంగా వున్న పెద్ద కనుమ. ఇది అంత సులభంగా ఎవరికీ కనిపించదు. ఈ కనుమలో ప్రకృతి సిద్ధమైన గుహలూ, సొరంగాలూ వున్నాయి. అవసరమైనప్పుడు వాటిలోకి వెళ్ళి దాక్కోవడానికి వీలుగా వుండేది.

తిరుగుబాటుదార్లు వారానికొకసారి అక్కడ కలుసుకునేవారు. అమృతపురిలో శరణార్థులుగా స్థిరపడిపోయిన వీరసింహుడి సైనికులు కొందరిని రప్పించి, యువకులు వారిద్వారా యుద్ధ కళలో శిక్షణ పొందేవారు.

యువకులు విడివిడిగా సన్యాసులుగానూ, వ్యాపారులుగానూ, పరదేశంనుంచి వచ్చిన యాత్రికులుగానూ రకరకాల మారువేషాలు ధరించి, సుమేధ రాజధాని శాంతిపురంలోనూ, గ్రామాలలోనూ తిరిగేవారు. వీరసింహుడి సైనికులు ఎవరినైనా దోచుకోవడానికి పథకం వేస్తున్నట్టు తెలియగానే, అడవికి వెళ్ళి సంగతిని వసంతుడికి తెలియజేసేవారు. వసంతుడి అనుచరులు చిన్న చిన్న గుంపులుగా విడిపోయి, నలుదిశలనుంచీ ఒక్కసారిగా వీరసింహుడి భటులపైబడి వారి పథకాన్ని ధ్వంసం చేసేవారు!

ఇలాగే ఎనిమిది సంవత్సరాలు గడిచిపోయాయి. సుమేధ ప్రజల జీవితం మరీ దుర్భరమైన స్థితికి చేరుకున్నది!

ఒకనాటి మధ్యాన్నంవేళ, వసంతుడు పొడవాటి గడ్డం పెట్టుకుని, దండకమండలాలు ధరించి గొప్ప సాధువులాగా వేషం వేసుకుని కపాలకంతుడి ప్రధాన సైనిక శిబిరం ఎదుట అరుగుమీద కూర్చున్నాడు. పట్టపగలు అంత ధైర్యంగా సైనికశిబిరం దగ్గరికి వచ్చిన వసంతుణ్ణి ఎవరూ అనుమానించలేక పోయారు.

అక్కడ గస్తీ తిరుగుతూన్న ఒక దళ నాయకుడు వసంతుణ్ణి నిజమైన సాధువే అని భావించి, అతన్ని సమీపించి, "మహాత్మా, తమకు హస్తసాముద్రికం తెలుసా?" అని అడిగాడు.

"తెలుసు," అన్నాడు వసంతుడు గంభీరంగా.

"అలా అయితే, తమరు మా ఇంటికి విచ్చేసి, నా హస్తరేఖలను పరిశీలించి నా భవిష్యత్తు తెలియజేయగలరా," అని ప్రార్థించాడు దళనాయకుడు.

ఆ దళనాయకుడి వెంట వెళితే ఏవైనా రహస్యాలు తెలుస్తాయని వసంతుడు, "అలాగే, అభీష్ట సిద్ధిరస్తు," అని దీవిస్తూ పైకి లేచాడు.

అప్పుడు భవనం కప్పునుంచి వేలాడుతూన్న సన్నటి ఊచకు అతని తల తగిలి, తలపై పెట్టుకున్న పెద్ద జుట్టు కాస్త దాని కొసకు చిక్కుకున్నది!

ఆ దృశ్యాన్ని చూసిన దళనాయకుడు అధిరిపడి, "ఏమిటీ! నువ్వు దొంగసన్యాసివా? ఎవరు నువ్వు?" అని గద్దించాడు.

ఇక వాడితో మాట్లాడి ప్రయోజనం లేదని గ్రహించిన వసంతుడు వెంటనే పరుగుపట్టాడు!

"పట్టుకోండి వాణ్ణి....వాడొక గూఢచారి ...పట్టుకోండి," అని అరుస్తూ వసంతుడి వెంట పరిగెత్తసాగాడు దళనాయకుడు. దళనాయకుడి వెంట మరిద్దరు సైనికులు పరిగెత్తసాగారు. ఇలా కొంత దూరం పరిగెత్తారు కాని, వసంతుణ్ణి పట్టుకోలేకపోయారు. వాళ్ళకు ఎదురుగా



గుర్రం మీద ఒక వ్యక్తి రావడం కనిపించింది.

"వాణ్ణి పట్టుకో........పట్టుకుంటే నీకు మంచి బహుమతి ఇస్తాను," అని అరిచాడు దళనాయకుడు.

ఆ గుర్రం మీద వస్తూన్న వ్యక్తి ఏ రాజోద్యోగో అయి వుంటాడని దళనాయకుడు భావించాడు. అయితే, ఆ ముసుగు వ్యక్తి వసంతుడితో, "వేగంగా వెళ్ళి నదిని దాటు. వీళ్ళ పని నేను చూస్తాను," అని, గుర్రాన్ని ముందుకు అదిలించి, "ఆగు అక్కడే! అతన్ని పట్టుకోవద్దు!" అంటూ దళనాయకుడి మీదికి కొరడా ఝుళిపించాడు!



దళనాయకుడు ఒక్క దెబ్బకే కింద పడిపోయాడు. అతని వెంట వచ్చిన ఇద్దరు సైనికులూ అతన్ని లేవనెత్తడానికి వెళ్ళారు.

ఆ వ్యక్తి గుర్రాన్ని వెనక్కు తిప్పి, ముందుకు ఉరికించాడు. గుర్రం నందినీ నదీతీరాన్ని చేరుకుని, ఒక్క గెంతున సన్నగా పారుతూన్న నదిని మెరుపులా దాటి అవతలిగట్టును చేరింది!

అలోగా నదిని ఈదుకుంటూ వెళ్ళి అవత్తలిగట్టు ఎక్కుతూన్న వసంతుడికి తన చేతిని అందించాడు ముసుగు వ్యక్తి. అప్పుడు ఆయన ముఖం మీది ముసుగు ఒకపక్కకు తొలగిపోయింది. మరుక్షణమే వసంతుడు ఆయన పాదాలపైబడి, "మహారాజా, నా ప్రాణాలను అనేకసార్లు రక్షించిన మహానుభావులు తమరే అయి వుంటారని అనుకుంటూనే వున్నాను. ఈ రోజు కూడా తమచేత రక్షింపబడడమే కాదు; తమ దర్శనభాగ్యం కూడా కలిగింది. నేనెంతో అదృష్టవంతుణ్ణి!" అన్నాడు ఆనందబాష్పాలు రాలుస్తూ.

రాజు అతన్ని ఆప్యాయంగా లేవనెత్తి, "వసంతా, నీ ధైర్యసాహసాలూ, కార్యదీక్షా మెచ్చుకోదగినవి. ప్రజలపట్ల నీకున్న ప్రేమాభిమానాలు ప్రశంసనీయమైనవి. అయితే, నేను ప్రాణాలతో ఉన్నట్టు మాత్రం ఎవరికీ తెలియనీకు," అన్నాడు.

"ఎందుకు మహారాజా?" అని అడిగాడు వసంతుడు.

"ప్రజలలో అశాంతి ప్రబలుతుంది. నన్ను పట్టుకోవాలన్న ప్రయత్నంలో వీరసింహుడు అమాయక ప్రజలను హింసించగలడు!" అన్నాడు రాజు.

"మహారాజా, ప్రజలకోసం పోరాడుతూన్న మా యువకులకైనా తమరు ప్రాణాలతో ఉన్నట్టు తెలియడం అవసరం. ఈ విషయం తెలిస్తే వాళ్ళెంతగానో ఉప్పొంగిపోగలరు. ధర్మప్రభువులయిన తమకోసం పోరాడుతున్నామంటే మాలో ఉత్సాహం పెల్లుబుకుతుంది. దయచేసి ఒకే ఒకసారి

మా యువకులకు కనిపించండి. పైగా, మీరే మమ్మల్ని నడిపించాలి. ఇంకా ఎన్నాళ్ళని వీరసింహుడి భటులతో దాగుడుమూతలు సాగించడం? ప్రజల పరిస్థితి మరీ దయనీయంగా తయారయింది. త్వరలో దీనికొక అంతం చూడాలి. ఆ దుర్మార్గుణ్ణి గద్దెదించాలి!'' అన్నాడు వసంతుడు ఆవేశంగా.

రాజు కొంతసేపు ఆలోచించి, ''అవును, నీ వన్నది నిజం. మన యువకులందరినీ ఒకటిగా చేర్చుకుని, అమృతపురి సైనికుల సహాయంతో వీరసింహుడి దుష్టపాలనను తుదముట్టించాలి!'' అన్నాడు.



వసంతుడి ముఖం ఆనందంతో విప్పారింది. అతడు పట్టరాని ఆనందంతో రాజుకు మళ్ళీ ఒకసారి నమస్కరించాడు.

* * *

అది ఒక పున్నమిరేయి. వసంతుడి అనుచరులు వందమంది తమ రహస్య స్థావరమైన లోయలో గుమిగూడి రాజుగారి రాకకోసం ఎదురుచూడసాగారు.

హఠాత్తుగా ఒక బండచాటునుంచి ''వసంతా!'' అన్న పిలుపు వినిపించింది. అది రాజుగారి కంఠస్వరమే అనిగుర్తించిన వసంతుడు అటుకేసి వెళ్ళాడు. అక్కడ రాజు కనిపించగానే, ''మహారాజా,'' అంటూ నమస్కరించాడు.

రాజు, ''అపాయం ముంచుకొస్తున్నది. ఇక్కడ ఒక్క క్షణం కూడా జాగు చేయకూడదు. ఒక్కసారిగా కనుమ రెండు వైపుల ద్వారాలూ మూసివేసి మీలో ఒక్కరు కూడా బయటికిపోకుండా అందరినీ హతమార్చాలని వీరసింహుడు పథకంవేశాడు. సైన్యంతో కపాలకంఠుడు బయలుదేరి వస్తున్నాడు. ఇప్పుడు వాళ్ళు కనుమ పడమటి ద్వారాన్ని సమీపిస్తున్నారు. తూర్పు ద్వారాన్ని చేరుకోవడానికి మరి కొంతసేపు పట్టవచ్చు. నేను పడమటి ద్వారం దగ్గర నిలబడి వాళ్ళను లోనికి జొరబడకుండా చూసుకుంటాను. ఈలోగా మీరందరూ తూర్పు ద్వారం గుండా



తప్పించుకుని వెళ్ళండి. కదలండి .... ఊం,'' అని ఆజ్ఞాపించాడు.

వసంతుడు, విషమించిన పరిస్థితిని గ్రహించాడు. వీరసింహుడి పథకం నెరవేరినట్టయితే తిరుగుబాటు అసాధ్యమై పోతుంది. అందువల్ల వసంతుడు, తన అనుచరుల కేసి తిరిగి, ''మీరందరూ తూర్పు ద్వారంగుండా, సురక్షిత ప్రాంతాలను చేరుకోండి,'' అని ఆజ్ఞాపించాడు.

మరుక్షణమే యువకులందరూ కనుమ తూర్పు ద్వారంకేసి నడిచారు. వసంతుడు మాత్రం రాజు దగ్గరే నిలబడ్డాడు.

''నువ్వు వెళ్ళవేం?'' అని అడిగాడు రాజు కాస్త కటువుగా.

''నా ప్రాణం పోయినాసరే మిమ్మల్ని ఇక్కడ ఒంటరిగా వదిలి వెళ్ళను, మహారాజా!'' అన్నాడు వసంతుడు దృఢమైన కంఠస్వరంతో.

ఇంతలో కనుమ పడమటి ద్వారం దాపులలో శత్రుసేనల అలికిడి వినిపించింది.

రాజు కత్తి దూసి ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. ద్వార మార్గం మరీ ఇరుకుగా వుండడంతో వసంతుడు రాజు వెనక నిలబడ్డాడు.

''నడవండి ముందుకు. కనుమలో జొరబడి ఆ దుర్మార్గులను హతమార్చండి!'' అని సైన్యాన్ని ఆజ్ఞాపించాడు కపాలకంతుడు, తను మాత్రం వెనకనే ఉంటూ.

కనుమలోకి ప్రవేశించడానికి ఒక్క అడుగు ముందుకు వేసిన మొదటి సైనికుడు, రాజుగారి కాలితాపుకు వెల్లకిలా వెనక్కుపడ్డాడు.

''లోపలికి అడుగువేస్తే ప్రాణాలు దక్కవు జాగ్రత్త!'' అని హెచ్చరించాడు వసంతుడు, రాజు చేసిన సూచన ప్రకారం.

''వసంతా, ఇదే నీ జీవితంలో ఆఖరి రాత్రి! కాదు, కాదు ఆఖరి క్షణం!'' అని అరుస్తూ కపాలకంతుడు ముందుకు దూకాడు. ద్వారానికి కాపలా వున్న వాళ్ళ దగ్గర ఆయుధాలు లేవని కపాలకంతుడు అనుకున్నాడు. ఆయుధాలు ఉన్నట్టయితే

లోపలికి అడుగుపెట్టిన సైనికుణ్ణి హత మార్చకుండా ఎందుకు వెలుపలికి తోస్తారు అని భావించాడు. నిరాయుధుడుగా వున్న వసంతుణ్ణి పట్టి బంధిస్తేనో లేదా హత మారిస్తేనో తనను వీరసింహుడు మెచ్చుకో గలడని ఆశించాడు కపాలకంఠుడు.

"కపాలకంఠా, నీ ప్రాణాలు కాపాడుకో. నిన్ను చంపాలన్నది మా ఆశయం కాదు. గుట్టుగా వచ్చినదారి పట్టి తిరిగి వెళ్ళిపో," అని హెచ్చరించాడు వసంతుడు.

అయినా, ఇంతలో కపాలకంఠుడు ద్వారంకేసి గురిచూసి ఒక ఈటెను విసిరాడు. ఆ ఈటె ఎదురుగుండా వున్న రాజు వక్షంలోకి దిగబడింది! ఆయన అలాగే కిందికి ఒరిగిపోయాడు. నేలకు ఒరిగిన వ్యక్తే వసంతుడనుకుని కపాల కంఠుడు ఉత్సాహంగా ముందుకు ఉరికాడు!

''దుర్మార్గుడా! పరమకిరాతకుడా!'' అని అరుస్తూ వసంతుడు కత్తి దూసి కపాలకంఠుడి తలను తెగనరికాడు! తల ఎగిరి దూరంగా పడింది!

మరుక్షణమే సైన్యంలో కలకలం చెల రేగింది. ''సేనాధిపతి మరణించాడు.... కపాలకంఠుడు మరణించాడు....'' అని హాహాకారాలు చేస్తూ సైనికులు భయపడి పోయి వెనుదిరిగి పారిపోయారు.



తూర్పుద్వారం గుండా కనుమలోకి ప్రవేశించాలనుకున్న వీరసింహుడి సైని కులు, వసంతుడి అనుచరులందరూ వెళ్ళిపోవడంతో, నిరాటంకంగా లోపలికి వచ్చారు. కాని అక్కడ ఎవరూ కని పించకపోయేసరికి ఆశ్చర్యంతో వెళ్ళి పోయారు.

ఈలోగా వసంతుడు రాజును, సన్నటి సెలయేటికి అవలవున్న ఒక గుహ లోపలికి మోసుకుపోయి, మెల్లగా దించి, తాగడానికి నీళ్ళు తెచ్చి ఇచ్చాడు. సైనికు లందరూ వెళ్ళిపోయారని నిర్ధారించు కున్నాక, అక్కడ వున్న చితుకులు ఏరి చిన్న మంట వేశాడు.

రాజు వసంతుడి తొడమీద తల ఆనించి పడుకుని, "వసంతా. నాకు మరణం సమీపిస్తున్నది. అయినా, నువ్వు పోరాటం కొనసాగించాలి. నాకు అధికారం పైన మక్కువలేదు. అందుకే ఇంతకాలం నా ఉనికి ఎవ్వరికీ తెలియకుండా గడిపాను. అయినా, వీరసింహుడి ధోరణిలో మార్పు వస్తుందన్న నమ్మకం నాకు లేదు. వాడు అమాయక ప్రజలను వేధించడం మానడు. వాడు పెట్టే బాధలనుంచి ప్రజలకు విముక్తి కలగాలి. అందుకే తుదిదాకా పోరాడమని ఆదేశిస్తున్నాను. ఇదే నా తుది సందేశం!" అన్నాడు.

రాజు వక్షస్థలం మీద వసంతుడు గుడ్డతో కట్టుకట్టాడు గాని, రక్తం స్రవిస్తూనే ఉన్నది. రాజు కంఠస్వరం మరీ నీరసంగా తయారయింది.

"మహారాజా, మీరు మరణించాక మేము ఎవరికోసం పోరాడాలి? వీరసింహుణ్ణి గద్దెదించగలం! కాని ఆ తరవాత ఎవరికి పట్టం గట్టడం? మీకు ముందే మహారాణీ, యువరాజూ మరణించారు కదా!" అన్నాడు వసంతుడు బాధగా.

"వసంతా, రాణి మరణించింది, నిజమే. కాని, ఆమె యువరాజుకు భద్రత కల్పించి మరీ వెళ్ళింది! ఒక ముని సంరక్షణలో యువరాజు క్షేమంగా పెరుగుతున్నాడు. ప్రస్తుతం ముని కాపాడుతున్నట్టే, కాలం ఆసన్నమయినప్పుడు, నువ్వే యువరాజుకు అండగా నిలబడాలి. ప్రజాక్షేమమే ప్రధాన లక్ష్యంగా పోరాడాలి!" అన్నాడు రాజు.

"యువరాజు క్షేమంగా ఉన్నారా? అలా అయితే ఆయన కోసం మేము పోరాటం కొనసాగిస్తాం. ఆ ఉదయభానుడిని కమ్ముకున్న మేఘాలను తొలగించగలం! యువరాజు ఎక్కడ వున్నారు ప్రభూ?" అని అడిగాడు వసంతుడు పట్టరాని ఉత్సాహంతో.

శాంతిదేవ మహారాజు వసంతుడికి అంతా వివరంగా తెలియజేసి, తెల్లవారు జామున కళ్ళుమూశాడు.—(ఇంకా వుంది)






# అద్దంసీతన్న

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒకదేశ పరిపాలకుడివైన నువ్వు, ఉన్న సంపదా, కీర్తిప్రతిష్ఠలతో తృప్తిచెందక మరి దేన్నో సాధించి మరింత కీర్తిమంతుడ వయ్యేందుకు, ఈ శ్మశానంలో తిరుగుతున్నావని, నాకు అనుమానం కలుగుతున్నది. ఒకవేళ నువ్వు ఇంకా ఎక్కువ సంపధనూ, కీర్తినీ సంపాయించినా, దానితో తృప్తిపడగలవన్న నమ్మకం లేదు. నీకు శ్రమతెలియకుండా వుండేందుకు, అద్దంసీతన్న అనేవాడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వెంకటాపురంలో వుండే రామన్న అతిథి మర్యాదకు బాగా పేరుపడడంవల్ల, అంతా

## బేతాళ కథలు



ఆయనను మర్యాదరామన్న అనేవారు. ఆయన పొరుగునే వుంటున్న దాయాది సీతన్న, తను కూడా రామన్నలా పేరు తెచ్చుకోవాలని తాపత్రయపడేవాడు. అందువల్ల అతడికి డబ్బు ఖర్చయిందే తప్ప పేరు రాలేదు.

ఒక రోజున సీతన్న ఇంటికి ఒక సాధువు వచ్చాడు. సీతన్న, సాధువుకు తృప్తిగా భోజనంపెట్టి తన గోడు చెప్పుకున్నాడు.

దీనికి సాధువు నవ్వి, "పేరు కోసం తాపత్రయపడకు. నీకున్నంతలో పది మందికీ సాయపడు. అవసరంలో వున్న వారిని శక్తికి మించి కూడా ఆదుకుంటూండు. అదే నీకు తృప్తినిస్తుంది," అని హితబోధ చేశాడు.

సీతన్నకు ఆ మాటలు నచ్చలేదు. అతను సాధువుతో, "అయ్యా, నిష్కామ కర్మ సాధువులకే తప్ప సాధ్యం కాదు. తన చుట్టుపక్కల ఇంతో అంతో మంచి పేరు తెచ్చుకోవాలనీ, సాటివారిలో సెభాష్ అనిపించుకోవాలనీ, ప్రతి మనిషికీ వుంటుంది. నేనైనా పదిమందిని ఆదరించి సంతోషపెట్టాలనుకుంటున్నానే తప్ప చెడ్డ పనికి తలపడలేదు. పేరు రానిపక్షంలో మంచి పనులు చేయాలన్నకోరిక, నాలో చచ్చిపోతుంది. కాబట్టి శిష్టులకు సాయపడే సాధువుగా మీరు, నాలోని మంచితనం చచ్చిపోకుండా ఏదైనా ఉపాయం చెప్పండి," అన్నాడు.

అప్పుడు సాధువు అతడికి ఒక మాయ అద్దాన్నిచ్చి, "నీ ఇంటికి వచ్చిన అతిథుల గదిలో, ఈ అద్దాన్ని వుంచు. ఇందులో ఎలాంటి కురూపిముఖం కూడా అందంగా కనిపిస్తుంది. ప్రతి మనిషికీ తన ముఖం అద్దంలో అందంగా కనిపిస్తే ఎంతో సంతోషంగా వుంటుంది," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నుంచి సీతన్న ఇంటికి వచ్చే అతిథుల సంఖ్య పెరిగింది. ప్రతి ఒక్కరూ అద్దంలో తమ ముఖాన్ని చూసు

కుని మురిసిపోయేవాళ్ళు. అతడి ఇంట్లో వున్న అద్దం గురించి గొప్పగా చెప్పుకునే వాళ్ళు. కొన్నాళ్ళు గడిచేసరికి సీతన్నకు అద్దంసీతన్న అని పేరు వచ్చింది.

సీతన్న ఇంట్లోని అద్దం గురించి వెంకటాపురం జమీందారుకు తెలిసి, వెంటనే ఆ అద్దం తీసుకురమ్మని సీతన్నకు కబురుపెట్టాడు. సీతన్న అద్దం తీసుకుని జమీందారింటికి వెళ్ళాడు.

జమీందారు అద్దంలో తన ముఖంచూసుకుని, "ఇందులో నా ముఖం కురూపిలా కనబడుతున్నదేమిటి?" అన్నాడు.

జమీందారు పరివారమంతా కూడా, అద్దంలో తమ ముఖాలు చూసుకుంటే, అందరికీ అలాగే జరిగింది.

"తప్పుడు ప్రచారం చేసి పేరు తెచ్చుకుందామనుకుంటున్నావా?" అంటూ జమీందారు ఆగ్రహంతో అద్దాన్ని నేలకు వేసికొట్టాడు. అయితే విచిత్రంగా అద్దం పగల లేదు.

సీతన్న అద్దం తీసుకుని దిగులుగా ఇంటికి వెళ్ళిపోయాడు.

జరిగింది తెలిసి కొందరు స్నేహితులు సీతన్న ఇంటికి వచ్చారు. అద్దంలో తమ ముఖాలు చూసుకున్నారు. వాళ్ళందరికీ సీతన్న అద్దంలో తమ ముఖాలు యథాప్రకారం చాలా అందంగానే కనిపించాయి. అప్పుడు అందరికీ ఒక రహస్యం తెలిసింది. సీతన్న ఇంట్లో మాత్రమే ఎవరి ముఖమైనా అద్దంలో అందంగా కనబడు





తుంది. ఇల్లుదాటితే, ఎవరి ముఖమైనా కురూపిలా కనబడుతుంది.

ఈ వార్త జమీందారుకు చేరింది. ఆయన స్వయంగా సీతన్న ఇంటికి వచ్చి, అద్దం మహిమ పరీక్షించాడు. అప్పుడు జమీందారుకు కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. ఆయన ఒక చిత్రకారుణ్ణి రప్పించి, అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి చిత్రపటాన్ని తయారు చేయిస్తే, ఆ బొమ్మ అద్భుతంగా వున్నది. జమీందారు ఎంతో సంతోషించి సీతన్నకు కొంత ధనం ఇచ్చి వెళ్ళాడు.

విశేషమేమిటంటే—ప్రతి మనిషి ముఖంలోనూ కొన్ని సౌందర్యఛాయలూ, కొంత కురూపితనం వుంటుంది. అద్దం, సీతన్న ఇంట్లో సౌందర్యఛాయలను మాత్రమే ప్రతిఫలిస్తుంది. సీతన్న ఇంటి బయట కురూపితనాన్ని మాత్రమే ప్రతిఫలిస్తుంది.

జమీందారు చిత్రపటం గీయించుకున్నాక, చాలామంది అదేవిధంగా తమ చిత్రపటాలు గీయించుకున్నారు. సీతన్న ఇంటికి వచ్చేపోయేవారి సంఖ్య బాగా పెరిగింది. ఆ ఊరివాళ్ళే కాక, దేశం నలుమూలల నుంచీ జనం అతడి ఇంటికి తీర్థప్రజల్లా రాసాగారు.

తన ఇంటికి వచ్చినవారికి మర్యాదలు చేయడం, సీతన్న ఎప్పుడో మానుకున్నాడు. ఒకరూ, ఇద్దరూ అయితే ఫర్వాలేదు కానీ, తీర్థప్రజలా వచ్చే జనానికి అతడెక్కడ మర్యాదలు చేయగలడు? అయితేనేం, అతడి ఇంటికి వచ్చిన జనమంతా సంతోషంగానూ, తృప్తిగానూ తిరిగి వెళుతున్నారు.

తన పేరు దేశమంతటా మారుమోగిపోతున్నదని తెలిసి, సీతన్న ఒకసారి తన గొప్పను చెవులారా వినాలనుకుని, ఇంటిని భార్యా బిడ్డలకు అప్పగించి రాజధానికి వెళ్ళాడు.

సీతన్న వెంకటాపురం నుంచి వచ్చాడని తెలిసి ఒకాయన, అతణ్ణి, "నీకు

అద్దంసీతన్న తెలుసా? చూడడానికి ఆయన ఎలా వుంటాడు?'' అని అడిగాడు.

అందుకు సీతన్న మనసులో ఎంతో సంతోషించినా, తనే అద్దంసీతన్ననని చెప్పకుండా, ''వెంకటాపురం అనగానే ఎవరికైనా అద్దంసీతన్న పేరే గుర్తుకొస్తుంది. ఆయన నాకు తెలియకుండా ఎలా వుంటాడు?'' అన్నాడు.

అద్దంసీతన్న గురించి విశేషాలు తెలుసుకుందామని, ఆ పెద్దమనిషి సీతన్నను తన ఇంటికి తీసుకువెళ్ళాడు. అక్కడ సీతన్న, మర్యాదరామన్న చిత్రపటాన్ని చూసి ఆశ్చర్యంగా, ''ఈయన ఎవరు? ఈ చిత్రపటం మీ ఇంట్లో ఎందుకున్నది?'' అని అడిగాడు.

అందుకు ఆ పెద్దమనిషి, ''అదేమిటి, ఈయన నీకు తెలియదా? ఈయనదీ మీ ఊరేగదా! అద్దంసీతన్న ఇంటికి వెళ్ళే వాళ్ళందరికీ, తనకు వీలైనంతలో వసతి సదుపాయం చేస్తాడు. మర్యాదకు ఎవరైనా ఆయన తర్వాతే! ఈయన పేరు మర్యాదరామన్న. మహారాజుకు ఈయన గొప్పతనం గురించి తెలిసి, చాలా ధనం ఇచ్చి సన్మానించాడు. ఆ ధనాన్ని కూడా రామన్న అతిథి మర్యాదకే ఉపయోగిస్తూంటాడు. ఈయన చిత్రపటాలు చాలామంది ఇళ్ళలో వున్నవి.'' అని చెప్పాడు.

ఆ మాటలకు అద్దంసీతన్న అసంతృప్తిగా తల ఊపి, తిరుగుప్రయాణమయ్యాడు.



మార్గమధ్యంలో సీతన్నకు అద్దాన్ని యిచ్చిన సాధువు కనిపించి, "ఏమిటంత దిగులుగా వున్నావు? అద్దంసీతన్న పేరు దేశమంతటా మారుమోగుతూంటే, నీకు తృప్తికలగదేం?" అన్నాడు.

"అయ్యా, నా దిగులుకూ, అసంతృప్తికీ కారణం చెప్పలేను. తమరిచ్చిన అద్దాన్ని తిరిగి తమరే స్వీకరించండి!" అని సీతన్న అద్దాన్ని సాధువుకు యిచ్చి, తన గ్రామం చేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అద్దంసీతన్న ప్రవర్తన వింతగా లేదా? ఇప్పుడతణ్ణి గురించి దేశంలో ఎరగని వారంటూ లేరు. అయినా, అతడు అసంతృప్తికి ఎందుకు గురయ్యాడు. మహిమ గల అద్దాన్ని సాధువుకు ఎందుకు తిరిగి యిచ్చాడు. ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అద్దంసీతన్న రాజధానిలోని పెద్దమనిషి చెప్పినది విన్న తరవాత, ఒక వాస్తవాన్ని గుర్తించ గలిగాడు. తీర్థ ప్రజలాగా అతడి ఇంటికి వచ్చేవాళ్ళందరూ అతడికోసంకాక, అతడి అద్దంకోసం వస్తున్నారు. అద్దంసీతన్న పేరు ప్రఖ్యాతులు, అద్దానివే తప్ప సీతన్నవి కావు. పైగా, ఆ అద్దాన్ని కూడా అతడు స్వయంగా తయారుచేయలేదు; ఎవరో దయతలచి యిచ్చినది. మర్యాద రామన్న విషయం అలా కాదు. ఆయనకు వచ్చిన పేరంతా, ఆయన అతిథి మర్యాద కారణంగా స్వయానా సంపాయించు కున్నది. అదే వాళ్ళిద్దరిమధ్యా వున్న తేడా! అందువల్ల తను రామన్నతో సరిపోలనని సీతన్నకు అప్పటికి అర్థమయింది. అందువల్లనే అతడు అసంతృప్తికి గురై, అద్దాన్ని తిరిగి సాధువుకు ఇచ్చేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# గుడ్డిదర్బారు

పూర్వం కరీంపట్టణ సమీపంలో షకురా అనే పేదవాడొకడు ఉండేవాడు. వాడు నవాబుల ఆస్థానంలో ఏ కొద్దిపాటి ఉద్యోగమైనా సంపాదించి, కనీసం నెలకు రెండు రూపాయల జీతమైనా తీసి, దానితో పొట్టపోసుకుందామని రాజధానికి వచ్చాడు. ఆ కాలంలో రెండు రూపాయల నెలజీతం కూడా బతుకుతెరువుగా నే ఉండేది.

అయితే, షకురా ఎంత ప్రయత్నించినా ఏమీ లాభం లేకపోయింది. వాడు ఎన్ని అర్జీలు పెట్టుకున్నా, సహాయపడే నాధుడు లేనందున, అన్నీ బుట్టదాఖలయాయి.

చివరకు షకురా సాహసించి ఒక పని చేశాడు; వాడు ఒక కంసాలి సహాయంతో ఒక మొహరు చేయించుకున్నాడు. అది పట్టుకుని ప్రధాన న్యాయస్థానం వెలపల ఒకచోట కూచుని, తనముందు ఒక బల్ల పెట్టుకున్నాడు. లోపలికి అర్జీలు పట్టుకు వెళ్ళే వారినందరినీ పిలిచి వాళ్ళ అర్జీల పైన ఆ మొహరుతో ముద్రవేసి, అర్జీకి ఒక పైసా చొప్పున వసూలు చెయ్యసాగాడు. ఇదంతా ప్రభుత్వం చేసిన ఏర్పాటే కాబోలుననుకుని అర్జీదార్లు తమ అర్జీలపై మొహరు ముద్ర వేయించుకుని ఆ తరవాతనే తమ కాగితాలను అధికార్లకు దాఖలు చేసుకోసాగారు. త్వరలోనే ఇది పరిపాటి అయిపోయింది. న్యాయస్థానోద్యోగులు కూడా ఈ ముద్రకు అలవాటై పోయారు, కాని ఆ ముద్ర ఎందుకు ఉన్నదీ, ఎవరు వేస్తున్నదీ, ఏ అధికారంతో వేస్తున్నదీ ఆలోచించిన వారు లేరు.

షకురా కొద్దికాలంలోనే బోలెడంత సంపాదించుకున్నాడు. తన రహస్యం బయటపడి పోతుందేమో, ఇది నవాబు దాకా పోతే తన తల తీయిస్తాడని వాడికి

భయం పట్టుకున్నది. అందుకు వాడొక ఉపాయం చేశాడు; తాను వేసే ముద్రలకు ఒక పైసా వసూలు చెయ్యటానికి బదులు రెండేసి వసూలు చేసి, అందులో ఒకటి తాను తీసుకుని, రెండవది నిలవవేసి ఉంచసాగాడు.

ఇలా పది సంవత్సరాలు గడిచినాక ఒకనాడు ఏ కారణం చేతనో షకురా కచేరీకి వెళ్ళలేకపోయాడు. ఆనాడు వచ్చిన అర్జీలపైన మొహరు ముద్ర లేదు. "వీటిపైన ముద్ర లేదు. ఇవి చెల్లవు." అన్నారు గుమాస్తాలు. ఈ వ్యవహారం పెద్ద అధికార్లదాకా వెళ్ళింది. వాళ్ళు, "అసలు ఈ ముద్ర ఏమిటి? దీన్ని ఎవరు వేస్తున్నారు?" అని ఆరాతీశారు.

పాత అర్జీలు తెప్పించి ఆ ముద్రను పరీక్షిస్తే అందులో ఇలా ఉంది: "అంధే సర్కార్—పీతల్ దర్వాజా—షకురా మొహర్." అది సర్కారు మొహరు కానేకాదు. ఈ సంగతి నవాబుదాకా వెళ్ళింది. షకురాను పట్టి తీసుకు రమ్మని ఆయన ఆజ్ఞాపించాడు. భటులు షకురాను తెచ్చి నవాబు ఎదట హాజరుపెట్టారు. ఇలా ఎప్పటికైనా జరుగుతుందని వాడు అనుకుంటూనే ఉన్నాడు, కనక వాడు తాను పోగుచేసి ఉంచిన పైకం వెంట బెట్టుకుని నవాబువద్దకు వెళ్ళాడు.

నవాబు వాణ్ణి, "ఎవరు నీవు? ఈ మొహరు నీదేనా? ఎవరు నీకు అధికారం ఇచ్చారు?" అని అడిగాడు. షకురా దాచకుండా జరిగినదంతా నవాబుకు విన్నవించి, "తమ వంతు ఇప్పటికి ముప్పైవేలు వసూలయింది. ఇదుగో ఆ డబ్బు!" అని చెప్పాడు.

వాడి చాకచక్యానికి నవాబు సంతోషించి వాడికి ఆ పనే ఒక ఉద్యోగంగా ఖాయం చేసి, మొహరులో ఉన్న "అంధే సర్కారు" అన్న మాటలలో "సర్కారు" అనేది మాత్రం ఉంచి "అంధే" అనే మాట చెక్కించేశాడు.

షకురా మొహరు చాలాకాలం అమలులో ఉంది.



# చందమామ అనుబంధం—22
## మన విజ్ఞాన సంపద

## ఎవరాయన?

పూర్వం ఏథెన్స్ నగరంలో ఒక తత్వవేత్త నివసిస్తూండేవాడు. ఆయన దగ్గరకు రోజూ పలువురు పలు సమస్యల గురించి సలహాలు పొందడానికి వచ్చేవారు. ఒకనాడు, ఒక యువకుడు ఆయన దగ్గరికి వచ్చి, ''అయ్యా, గొప్పవక్త కావాలని నా కోరిక. నేను ఎన్నో ప్రాంతాలు తిరిగి వచ్చాను. ఎందరో ప్రముఖులను సందర్శించాను. వారందరూ కూడా నా తెలివితేటలను ఎంతగానో మెచ్చుకున్నారు. ఇప్పుడు నాకు ఉపన్యాసకళను నేర్చుకోవాలనే కోరిక కలిగింది....'' అంటూ పదిహేను నిమిషాలు ఎడతెరపి లేకుండా ఏవేవో మాట్లాడి అఖరికి, ''మీరు నాకు ఉపన్యాసకళను నేర్పారంటే మీరు కోరే రుసుం చెల్లించుకుంటాను,'' అన్నాడు.

''మంచిది. అయితే నువ్వు రెండింతలు రుసుం చెల్లించవలసి వుంటుంది మరి!'' అన్నాడా తత్వవేత్త.

''రెండింతలా?'' అని అడిగాడు యువకుడు ఆశ్చర్యంగా.

''అవును. ఎందుకంటే నీకు మాట్లాడకుండా ఎలా వుండాలో తెలియజేసే మౌనకళ గురించి మొదట బోధించాలి. ఆ తరవాతే ఉపన్యాస కళ గురించి వివరించాలి!'' అన్నాడా తత్వవేత్త.

ఆ తత్వజ్ఞాని ఎవరో మీకు తెలుసా?

(36 వ పేజీ చూడండి)

## మీకు తెలుసా?

1. ఒక దేశం జాతీయ చిహ్నంగా గల పక్షి ఏది? ఆ దేశం ఏది?
2. తమ దేశంలో నివసించకపోయినా, 1948 వ సం॥లో ఆ దేశాధ్యక్షపదవిని అలంకరించమని ఒక ప్రపంచ ప్రసిద్ధ మేధావిని కోరారు. ఆయన ఎవరు?
3. ఆ దేశం ఏది?
4. ఎందుకు అలా జరిగింది?
5. శ్రీలంక అన్న మాటకు అర్థం ఏమిటి?

(36 వ పేజీ చూడండి)

# అయోధ్యానగరం

అయోధ్య అంటే అజేయం అని అర్థం. అయోధ్యానగరం అంటే శత్రువులు జయించలేని నగరం అని అంటారు. సరయూ నదీ తీరంలోని అయోధ్య సూర్యవంశపు రాజులు (దశరథుడు మొదలైనవారు) పరిపాలించిన కోసల దేశానికి రాజధానీ నగరంగా ఉండేది.

మన దేశంలోని ఏడు పవిత్ర నగరాలలో అయోధ్య ఒకటి. శ్రీరాముడి జన్మస్థానం కావడంవల్ల భారతీయులు అయోధ్యను పవిత్రభూమిగా భావిస్తారు. ఇక్కడ రామజన్మస్థానమూ, ఆయన యాగం చేసిన స్థలమూ, సీతమ్మ వంటశాలా మొదలైనవి ఇంకా ఉన్నట్టు చెబుతారు.

ఉత్తరోత్తరా కోసలరాజధాని సాకేత నగరానికీ, ఆ తరవాత శ్రావస్తికీ మార్చబడింది. 4-5 శతాబ్దాలలో అయోధ్య,

## చందమామ కబుర్లు

### అతిపిన్న వయసు డాక్టర్!

మీరీ వార్త చదివేసరికి న్యూయార్క్‌లో చదువుతూన్న బాలమురళీకృష్ణ అంబటి అనే భారతీయ విద్యార్థి, వైద్యవిద్య పూర్తిచేసి ప్రపంచంలోకెల్లా అతి పిన్న వయసుగల డాక్టర్ అవుతాడు! ఇంతకు పూర్వం ఇటలీలోని ఇజ్రాయెల్ విద్యార్థి పద్దెనిమిదేళ్ళలో డాక్టర్ అయ్యాడు!





### తిమింగిల గానం!

తిమింగిలాలను గురించి ఇరవైఆరు సంవత్సరాలపాటు జరిగిన ఒక పరిశోధన ద్వారా కొన్ని విషయాలు వెలుగులోకి వచ్చాయి. తిమింగిలాలన్నీ ఒకే రకం ధ్వనులు పుట్టించవనీ, కొన్ని ధ్వనులు మనుషుల పాటల్లా వుంటాయనీ, తమ భావాలను గానంతో వ్యక్తం చేస్తాయనీ తెలియ వచ్చింది.




గుప్తులకు రెండవ రాజధానిగా అయింది. ఆ పిమ్మట అయోధ్య క్రమంగా రాజకీయ ప్రాముఖ్యతను కోల్పోయినప్పటికీ, మధురానగరం లాగానే అశేష భారత ప్రజల ప్రేమాభిమానాలకు పాత్రంగా వెలుగొందుతూ, తరతరాలుగా స్ఫూర్తిని కలిగిస్తున్నది.

ఒక కాలఘట్టంలో బౌద్ధ జైన మతాలకు కూడా అయోధ్య కేంద్రంగా ఉండేది. ఇరవైనలుగురు తీర్థంకరులలో ఇరవైముగ్గురు ఇక్ష్వాకు వంశానికి చెందిన వారే. వారిలో ఆదినాథ్, అజిత్‌నాథ్, అభినందనాథ్, అనంతనాథ్, సుమతీనాథ్ అనే ఐదుగురు బోధకులు అయోధ్యలోనే జన్మించారు.

ఈనాటి అయోధ్య, ఉత్తరప్రదేశ్‌లో లక్నో—గోరఖ్‌పూర్ రైల్వేస్టేషన్ల మధ్య ఉన్న చిన్న పట్టణం.

సీతారాములకు సంబంధించిన దేవాలయాలతోపాటు—శ్రీరాముడి కుమారుడు కుశుడు నిర్మించాడని విశ్వసింపబడే నాగేశ్వరనాథ ఆలయమూ, నవాబు షుజావుల్లా నిర్మించిన హనుమాన్‌ఘర్‌లోని హనుమంతుడి గుడీ ఇక్కడ ప్రసిద్ధమైనవి!

అయోధ్యకు 25 కి. మీ. దూరంలో నందిగ్రామం ఉన్నది. రాముడు వనవాసానికి వెళ్ళినప్పుడు భరతుడు ఇక్కడి నుంచే పద్నాలుగేళ్ళు రాజ్యపాలన చేశాడని చెబుతారు!

# సాహిత్యావలోకనం

1. మరణించాడనుకుని పాతిపెట్టే సమయంలో, ప్రాణాలతో లేచి కూర్చుని ఆ తరవాత 30 సంవత్సరాలు జీవించిన ఇటలీ మహాకవి ఎవరు ?

2. షేక్స్‌పియర్ మరణించిన రోజే మరణించిన మరొక గొప్ప రచయిత ఎవరు?

3. ధృతరాష్ట్ర గాంధారులకు కుమార్తె ఉండేదా ?

4. వేదమంత్రాలను రచించిన వారిలో ప్రసిద్ధి గాంచిన మునికుమారి ఏవరు ?

5. 'శతకం' అంటే ఏమిటి ?

## సమాధానాలు

ఎవరాయన ?

సోక్రటీసు

లోకజ్ఞానం

1. గరుడపక్షి. ఇండొనేసియా జాతీయ చిహ్నం.
2. అల్బర్ట్ ఐన్‌స్టీన్
3. ఇజ్రాయెల్
4. యూదుల రాజ్యమైన ఇజ్రాయెల్ అప్పుడే ఏర్పడింది. ఐన్‌స్టీన్ యూదుడు కావడంవల్ల.
5. ప్రకాశవంతమైన భూమి.

సాహిత్యం

1. పెట్రార్క్ (1304-1374).
2. 'డాన్‌క్విక్సోట్' రచించిన సెర్వాంటెస్.
3. అవును; పేరు దుశ్శల.
4. గర్గముని కుమార్తె గార్గి.
5. ఒకే విషయం మీద వంద పద్యాలు గల పుస్తకం.



# శ్రీ రామకృష్ణపరమహంస

## (3)

గదాధరుడు ఆలయంలో పూజాది కార్యక్రమాలు నిర్వర్తించేప్పుడు, వాటిలో పూర్తిగా లీనమైపోయేవాడు. పూజిస్తూన్నప్పుడు ఒక్కొక్కసారి విగ్రహానికీ, తనకూ భేదం మరచిపోయి పువ్వులను తన శిరస్సుమీదికే చల్లుకునేవాడు.

అర్ధరాత్రి వేళలలో గదాధరుడు ఒక వృక్షంకింద కూర్చుని గంటల తరబడి ధ్యాన నిమగ్నుడై పోయేవాడు. గుడిలో పనిచేసే మిగతావాళ్లు ఆయన విచిత్ర ప్రవర్తనకు అబ్బురపడసాగారు!





ఆలయ ప్రధాన పూజారి అయిన గదాధరుడి ఈ విచిత్ర ప్రవర్తన గురించి, వాళ్ళు రాణిరాస్మాని అల్లుడయిన మధురానాథ్‌కు తెలియజేశారు. ఈ విషయాన్ని స్వయంగా దర్యాప్తు చేస్తానని మధురానాథ్ వారికి చెప్పి పంపాడు.



ఒకనాడు మధురానాథ్ ఆలయానికి వచ్చి లోపలికి తొంగిచూశాడు. అప్పుడు గదాధరుడు దేవిని ప్రసాదం అరగించమని ప్రార్థిస్తూ నిజంగానే విగ్రహానికి ప్రసాదం తినిపిస్తున్నాడు! మధురానాథ్, గదాధరుడి భక్తిపారవశ్యాన్ని స్వయంగా దర్శించి ఆనందంతో వెనుదిరిగాడు!

ఒకనాడు రాణి రాస్మాని ఆలయ దర్శనానికి వచ్చి, గదాధరుడు పాడుతూన్న భక్తిగీతాలను వింటూ కూర్చున్నది. ఉన్నట్టుండి ఆమెకు—న్యాయస్థానంలో ఇంకా తీర్పు కాని ఒక వ్యవహారాన్ని గురించిన ఆలోచన వచ్చింది. వెంటనే గదాధరుడు ఆమెను చెంప మీద కొట్టి, "ఇప్పుడు కూడా అల్ప విషయాల గురించిన ఆలోచన దేనికి?" అన్నాడు కోపంగా.





గదాధరుడి చర్యకు రాణిగారి పరిచారకులు ఆగ్రహం చెంది ఆయన మీదికి పోబోయారు. కాని, ఇంతలో రాణి అడ్డుపడింది. తన మనోభావాలను తెలుసుకుని, తనను, సన్మార్గంలో నడిపించగల శక్తి ఆలయ పూజారికి ఉన్నదని ఆమె గ్రహించింది!

ఒక దశలో గదాధరుడు రకరకాల వింత అనుభూతులకు లోనుకాసాగాడు. తన నుంచి వెలువడిన ఒక భూతాన్ని, దాన్ని వెంబడించి వచ్చిన శివుడి వంటి తేజస్వి, శూలంతో పొడిచాడు. మరు క్షణమే భూతం మాయమయింది. ఈ అనుభూతితో తనలోని కల్మషాలన్నీ హరించుకుపోయాయని గదాధరుడు గ్రహించాడు.





గదాధరుడి తల్లి కుమారుడికి పెళ్ళి చేయాలనుకున్నది. సరైన వధువుకోసం తల్లి తరపు బంధువులు వెదకసాగారు. ఒకనాడు గదాధరుడు ఉన్నట్టుండి, "నా కాబోయే భార్య, జయరాంబాటీలోని రామచంద్ర ముఖోపాధ్యాయ ఇంట్లో పెరుగుతున్నది," అని అన్నాడు.

అంతకు ముందెన్నడుగానీ, గదాధరుడు జయరాంబాటీకి వెళ్ళలేదు. అయినా ఆయన సలహాప్రకారం బంధువులు అక్కడికి వెళ్ళారు. గదాధరుడు చెప్పినట్టే అక్కడి రామచంద్ర ముఖోపాధ్యాయ కుమార్తెను చూసి పెళ్ళి ఖాయం చేశారు.





అనుకున్న ప్రకారం శారదామణితో గదాధరుడి వివాహం జరిగింది. గదాధరుడు పసిపిల్లవాడి ఉత్సాహంతో పెళ్ళి తతంగాలలో పాల్గొన్నాడు. బాలికగా వున్న శారదామణి ఎంతో అందంగానూ, నిర్మలమైన చూపులతోనూ, అందరి దృష్టినీ ఆకర్షించింది.

పెళ్ళి తరవాత ఆలయానికి తిరిగి వచ్చిన గదాధరుడు మళ్ళీ తీవ్రంగా ఆధ్యాత్మిక సాధనకు పూనుకున్నాడు. భక్తితత్పరతలోని పరిపూర్ణ ఆనందాన్ని అనుభవించడానికి, ఆదర్శభక్తుడయిన హనుమంతుణ్ణి గురించి గాఢంగా ధ్యానించ సాగాడు.





ఒకనాడు ఒక అందమైన దేవతాస్త్రీ తనకేసి నడిచి వస్తున్నట్టు గదాధరుడు అనుభూతి చెందాడు. ఆ తరవాత కొంతసేపటికి ఆ దేవతాస్త్రీ సాక్షాత్తు సీతమ్మతల్లి అని గ్రహించాడు. ఆమె ఆయనకేసి మెల్లగా వచ్చి ఆయనలో లీనమైపోయింది. —(ఇంకావుంది)




# పుణ్యవిక్రయం

ఒక ఊళ్ళో శంభుడనే పేదవాడుండేవాడు. వాడి భార్య పేరు గౌరి. ఒక సంవత్సరం వానలు లేక పంటలు పండక, రైతులు ఇబ్బందిపడసాగారు. శంభుడికి కూలిపని దొరకడం కష్టమైపోయింది. పట్నం వెళ్ళి ఏమైనా పని దొరుకుతుందేమో చూడమని గౌరి, శంభుడికి సలహా యిచ్చింది. శంభుడు పట్నం వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

మర్నాడు వేకువజామునే లేచి, గౌరి ఐదు జొన్నరొట్టెలు తయారు చేసింది. అందులో ఒకటి మాత్రం తనకోసం వుంచుకుని, మిగతా నాలుగూ మూటకట్టి భర్త కిచ్చింది. రొట్టెమూట తీసుకుని శంభుడు పట్నానికి బయలుదేరాడు.

ఈ సంగతి తెలిసి, పక్కింటి శివానందుడనేవాడు, తన ముసలి గుర్రాన్ని శంభుడికిచ్చి, "అంత దూరం, కాలి నడకన పోవడం, చాలా శ్రమ. నా గుర్రాన్ని తీసుకుపో. ఒక నెల రోజుల తర్వాత, నువ్వు తిరిగి వచ్చినా ఫర్వాలేదు." అన్నాడు.

శంభుడు, శివానందు డిచ్చిన గుర్రం మీద పట్నం కేసి బయలుదేరాడు. మిట్ట మధ్యాహ్నం అయ్యేసరికి వాడు ఒక నది దాపులకు చేరుకున్నాడు. అక్కడ వాడు గుర్రాన్ని పచ్చికబీడులో వదిలి, కాళ్ళూ, చేతులూ కడుక్కొని, నది ఒడ్డునే వున్న ఒక బండరాయి మీద కూర్చుని, రొట్టెలు తిందామని మూట విప్పాడు.

ఆ సమయంలో, బక్కచిక్కిన కుక్క ఒకటి వాడి దగ్గిరకు వచ్చింది. దాన్ని చూస్తూనే, అది బాగా ఆకలి బాధలో వున్నదని గ్రహించిన శంభుడు, దాని ముందు ఒక రొట్టెను పడవేశాడు. కుక్క ఆ రొట్టెను క్షణాల్లో నమిలి

ఎమ్. శివదేవ్



మింగేసి, తల ఎత్తి శంభుడి కేసి ఆశగా చూడసాగింది.

శంభుడికి దాని మీద చాలా జాలి కలిగింది. వాడు మూటలో మిగిలివున్న మూడు రొట్టెలనూ, ఒకదాని తర్వాత ఒకటిగా కుక్క ముందు వేశాడు. కుక్క వాటిని ఆవురావురుమంటూ తిని, ఇక మూటలో రొట్టెలు లేవని తెలుసుకుని, తృప్తిగా తోకాడించుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

శంభుడు నదిలోని నీళ్ళతో తన ఆకలిని చల్లార్చుకుని, మళ్ళీ గుర్రం ఎక్కి పట్నం కేసి తిన్నగా ప్రయాణం సాగించి, చీకటి పడేవేళకు పట్నం చేరుకున్నాడు.

ఆ రాత్రికి వాడొక ధర్మసత్రంలో బస చేశాడు.

మర్నాడు ఉదయమే వాడు పనికోసం వెదుకుతూ, నాలుగు వీధులూ తిరిగాడు. సాయంకాలం కావస్తున్నా, ఎక్కడా వాడికి కూలిపని దొరకలేదు. చేతిలో చిల్లిగవ్వ లేదు. వాడు నిరాశతో ఏం చేయడమా అని ఆలోచిస్తూండగా, ఒకచోట చాలా మంది జనం గుమిగూడి వుండడం కంట బడింది.

శంభుడు ఆ జనం దగ్గిరకుపోయి, వాళ్ళల్లో ఒకణ్ణి సంగతేమిటని అడిగాడు. అక్కడ కుబేరమిశ్రుడనే కోట్లకు పడగలెత్తిన మహాసంపన్నుడొకడు, పుణ్యం కొంటున్నాడు. ఆ చుట్టూ చేరిన జనం తమ తమ పుణ్యాలను అమ్మవచ్చినవాళ్ళు.

ఇది విని శంభుడు ఆశ్చర్యపోయి, కొంచెంసేపు తన దగ్గిర అమ్మడానికి పుణ్యం ఏమైనా వున్నదా అని ఆలోచించాడు. వాడికి తమ ఊళ్ళో తండ్రి తవ్వించిన బావి గుర్తుకు వచ్చింది.

వాడు కుబేరమిశ్రుడి ముందుకు పోయాడు. ఆయన శంభుడి కేసి పరీక్షగా చూసి, "నువ్వు అమ్మదలచిన పుణ్యం ఏమిటి?" అని అడిగాడు.

శంభుడు, తన తండ్రి తవ్వించిన బావి సంగతి చెప్పాడు. కుబేరమిశ్రుడు అది

వింటూనే చిన్నగా నవ్వి, "ఆ పుణ్యం నీ తండ్రికే చెందుతుంది. నువ్వు చేసుకున్న పుణ్యం ఏమీ లేదా?" అని అడిగాడు.

అందుకు శంభుడు విచారంగా, "నేను కూలీనాలీ చేసుకుని పొట్టపోసుకునేవాణ్ణి. అలాంటి నేను పుణ్యకార్యాలేం చెయ్యగలను!" అన్నాడు.

కుబేరమిశ్రుడు ఒక క్షణం మౌనంగా వూరుకుని, "ఎవరైనా నా దగ్గిరకు వచ్చినప్పుడు, వాళ్ళు చేసిన పుణ్యమేమిటో తెలుసుకునే శక్తి, నాకున్నది. నిన్నటి రోజున ఆకలితో నకనకలాడిపోతున్న ఒక కుక్కకు, నాలుగు రొట్టెలు ఆహారంగా ఇచ్చి, ఎంతో పుణ్యం సంపాయించుకున్నావు. నువ్వు అమ్మదలచుకుంటే, అందులో ఒక్క రొట్టె పుణ్యం మాత్రమే, నేను కొనగలను," అన్నాడు.

ఇది విని శంభుడు ఆశ్చర్యపోతూండగా, కుబేరమిశ్రుడు ఒక రొట్టె తెప్పించి, వాడితో, "ఒక రొట్టె పుణ్యం ఇందులోకి రావాలని మనసులో అనుకుని, ఈ రొట్టెను తాకు," అని చెప్పాడు.

శంభుడు అలాగే చేశాడు. అప్పుడు కుబేరమిశ్రుడు రొట్టెను త్రాసులో ఒక వైపునపెట్టి, రెండవ వైపున తనముందు గుట్టపోసివున్న బంగారు నాణేలను దోసిళ్ళతో పోశాడు. అయినా, ఆ బంగారం



రొట్టెకు సరితూగలేదు. ఇది చూసి ఆయన చిరునవ్వునవ్వి, తన మెడలోని రత్నాల హారాన్ని త్రాసులో వేశాడు. ఇప్పుడు రొట్టెకు, బంగారం వేసిన త్రాసు సరితూగింది.

ఈ విధంగా, ఒక రొట్టె పుణ్యాన్ని కుబేరమిశ్రుడికి ధారపోసి, ధనం మూటను గుర్రంపై వేసుకుని, శంభుడు తన ఊరుకేసి బయలుదేరాడు. అయితే, మార్గమధ్యంలో ఒకచోట గుర్రం ఒక మడుగు పక్కగా పోతూ, కాలు జారి మడుగులో పడి, అక్కడ వున్న ఊబిలో చిక్కుకుని కూరుకుపోసాగింది.

ఈ సమయంలో అటుగా వస్తున్న సన్యాసి ఒకడు, ఇది చూసి శంభుడితో

''వృథాగా ఎందుకు ప్రాణాలు పోగొట్టుకుంటావు? ఇది ఒక శాపగ్రస్తమైన ఊబి! నువ్వు చేసిన పుణ్యమేదైనా ధార పోస్తే, ఈ ఊబిలోంచి గుర్రంతోపాటు నువ్వూ ప్రాణాలతో బయటపడగలవు.'' అని చెప్పాడు.

వెంటనే శంభుడు, ''నేనొక రొట్టె పుణ్యాన్ని వదులుకుంటున్నాను!'' అన్నాడు పెద్దగా.

గుర్రం వెంటనే ఊబిలోంచి కొంచెం పైకి వచ్చింది. తర్వాత వాడు మిగిలిన రెండు రొట్టెల పుణ్యాన్ని కూడా వదులుకుంటున్నట్టు చెప్పాడు. అయినా, గుర్రం మోకాళ్ళలోతువరకూ ఊబిలోనే వున్నది.

అప్పుడు సన్యాసి, శంభుణ్ణి, ''నీ దగ్గిర ఏ పుణ్యఫలమూ మిగిలి లేదా?'' అని అడిగాడు.

ఇందుకు శంభుడు, ''స్వామీ, లేకేం!'' అంటూ గుర్రం మీద వున్న ధనం మూటను సన్యాసికి చూపి, దాన్ని ఎత్తి ఊబిలోకి విసిరివేశాడు.

ఆ మరుక్షణం సన్యాసితోపాటు, ఊబి వున్న మడుగు కూడా మాయమైంది. శంభుడు ఆబ్బురపాటుతో దిక్కులు చూస్తున్నంతలో, ఒక దేవత ప్రత్యక్షమై శంభుడితో, ''నేను ధర్మదేవతను! నీ దయాగుణం మెచ్చదగింది. నువ్వు ఆకలితో వుండీ, ఒక కుక్కకు నీవద్ద వున్న రొట్టెలన్నిటినీ ఆహారంగా ఇచ్చావు. అంతేకాదు; ధనం కోసం ప్రాణాన్ని పణంగా పెట్టే మూర్ఖత్వం, నీలో లేదు. నేటినుంచి ధనధాన్యాలతో తులతూగుతూ, దానధర్మాలు చేస్తూ, నాకు సంతోషాన్ని కలిగించు,'' అని ఆశీర్వదించి అంతర్ధానమైంది.

ఆ మరుక్షణంలో శంభుడికి ధనం మూట గుర్రం మీద కనిపించింది. వాడు ఆనందంగా ఇంటికి తిరిగి వచ్చి, తనకు లభించిన ధనంతో పొలాలు కొని వ్యవసాయం చేసుకుంటూ, కష్టాల్లో వున్న వారికి సాయపడుతూ, నలుగురిలోనూ ధర్మాత్ముడన్న పేరు తెచ్చుకున్నాడు.






వాలి మరణించాడని సుగ్రీవుడు బిలాన్ని కొండరాయితో కప్పి తిరిగి వచ్చాడు గానీ, వాలి మాయావి చేతిలో చావలేదు. తానే మాయావిని చంపి తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చిన వాలికి సుగ్రీవుడు గౌరవంగా నమస్కారం చేశాడు. వాలి సుగ్రీవుణ్ణి కోపంగా తిట్టిపోశాడు. సుగ్రీవుడు తన కిరీటం తీసి వాలి పాదాల వద్ద పెట్టి, అతనికి సాష్టాంగనమస్కారం చేశాడు.

వాలి కోపం పోగొట్టటానికి సుగ్రీవుడు, ''ఆహా, అన్నా! నువ్వు శత్రువును చంపి తిరిగి రావటం నా మహాభాగ్యం. అంతకన్న మా కందరికీ సంతోషం ఏమున్నది? నేను బిలం దగ్గిర ఎంతోసేపు నిలబడ్డాను. అందులో నుంచి రక్తం బయటికి వచ్చినప్పుడు నాకు కలిగిన దుఃఖం ఏమని చెప్పను? అప్పుడా బిలాన్నికొండరాయితో కప్పిపెట్టి, కిష్కింధకు తిరిగి వచ్చాను. నేను రాజ్యాభిషేకం కోరలేదు. పౌరులూ, మంత్రులూ రాజుండాలని పట్టుబట్టి నాకు రాజ్యాభిషేకం చేశారు. ఇప్పుడు నువ్వే రాజువు. నేను యువరాజును. నన్ను అపార్థం చేసుకోకు,'' అన్నాడు.

కాని సుగ్రీవుడి మాటలను వాలి వినిపించుకోలేదు. అతను అందరినీ పిలిచి, వారి ఎదట సుగ్రీవుణ్ణి నానా మాటలూ అన్నాడు:

''వీడూ, నేనూ మాయావిని తరుముకుంటూ వెళ్ళాం. మాయావి ఒక భయంకరమైన బిలంలో దూరాడు. వాణ్ణి చంపి గాని కిష్కింధకు తిరిగి రానని శపథం

3. సుగ్రీవస్నేహం



చేసి, ఈ సుగ్రీవుణ్ణి బిలద్వారం వద్దనే ఉండమని చెప్పి, లోపలికి వెళ్ళాను. బిలంలో నాకు మాయావి ఒకంతట దొరకలేదు. శ్రమపడి వాణ్ణి వెతికి, పట్టుకుని చంపి, వాడి వాళ్ళనందరినీ చంపి తిరిగి వచ్చేసరికి, బిలద్వారం కూడా నాకు కనిపించలేదు. 'సుగ్రీవా' అని కేకలు పెట్టితే జవాబు లేదు. ఈ దుర్మార్గుడు రాజ్యం కోసం ఆ బిలాన్ని మూసి, నన్ను బయటికి రాకుండా చేద్దామనుకున్నాడు. బిలానికి అడ్డంగా ఉన్న రాతిని తన్ని పగలగొట్టి వచ్చేశాను.''

ఇలా అని, వాలి సుగ్రీవుణ్ణి కట్టుబట్టలతో వెళ్ళగొట్టాడు. సుగ్రీవుడి భార్య అయిన రుమను తన భార్యగా చేసుకున్నాడు. సుగ్రీవుడు వాలి భయం కొద్దీ ఋశ్యమూకపర్వతం మీద తల దాచుకున్నాడు. ఈ వనవాసంలో సుగ్రీవుడి వెంట హనుమంతుడూ, జాంబవంతుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరులు అతని మంత్రులుగా ఉన్నారు.

సుగ్రీవుడి వెంట ఉంటున్న సమయంలోనే హనుమంతుడికి రాముడితో పరిచయం కలిగింది. అది ఇలా జరిగింది:

ఋశ్యమూకం మీద ఉన్న సుగ్రీవుడు ఒకనాడు పంపాసరోవరం పక్కన ఉన్న వనంలో ఇద్దరు మనుషులు సంచరిస్తూ ఉండటం చూశాడు. వాళ్ళు ధనుర్బాణాలు ధరించి, చూడటానికి చాలా అద్భుతంగా ఉన్నారు. వాళ్ళను చూస్తూనే సుగ్రీవుడు భయపడిపోయాడు. వాళ్ళు వాలి పంపిన మనుషులు అయి ఉంటారనీ, వాలి ఋశ్యమూకపర్వతం మీదికి రాకూడదని శాపం ఉన్నది గనక, తనను చంపించటానికి ఎవరినో పంపాడనీ సుగ్రీవుడు అనుకున్నాడు. అతను కాలు కాలిన పిల్లిలాగా తిరుగుతూ, ఎక్కడికైనా పారిపోవాలనుకుంటున్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, ''వాలి ఇక్కడికి రాలేదు. అతను వచ్చిన జాడ లేదు. భయం దేనికి?'' అన్నాడు.

"వాలి వచ్చాడని నేను అనలేదు. ఆ ఇద్దరు మనుషులనూ చూడు. వాళ్ళ వద్ద ఉన్న ధనుర్బాణాలూ, ఖడ్గాలూ చూడు. వాళ్ళను చూస్తే ఎవరికైనా భయం కలిగితీరుతుంది. వాళ్ళను వాలి నా పైకి పంపాడని నా అనుమానం. రాజైన వాడికి ఎందరో సహాయకులు ఉంటారు. మనం గూఢచారులను గురించి ఏమరి ఉండరాదు; ఉంటే చచ్చిపోతాం. రాజులు శత్రువులను నాశనం చెయ్యటంలో అనేక ఉపాయాలు ఆలోచిస్తారు. అందులోనూ వాలి మహా తెలివిగలవాడు. చూడు, హనుమంతుడా! నువ్వు వెళ్ళి, వాళ్ళు మాట్లాడుకునే మాటలు విని, వాళ్ళు మంచివాళ్ళో, దుర్మార్గులో తెలుసుకో. వాళ్ళు అరణ్యాలలో ఆయుధాలు ధరించి ఎందుకు తిరుగుతున్నారో అడుగు. వారికి నా మీద ఏదైనా ద్వేషభావం ఉంటే దాన్ని పోగొట్టి, నాపై వారికి సద్భావం కలిగేటట్టు చెయ్యి." అన్నాడు సుగ్రీవుడు.

అలాగే చేస్తానని చెప్పి, హనుమంతుడు రామలక్ష్మణులు సంచరిస్తున్న చోటికి బయలుదేరాడు. అతను తన వానర రూపాన్ని మార్చుకుని ఒక బ్రహ్మచారి రూపం ధరించి, రామలక్ష్మణులను సమీపించి, అతి వినయంగా, "అయ్యలారా,



మిమ్మల్ని చూస్తే రాజర్షులుగానూ, దేవతా సమానులుగానూ, తపోవ్రతం పూనినవారుగానూ కనిపిస్తున్నారు. మీరు ఈ పంపా తీరానికి ఎలా వచ్చారు? మీరెవరు? మిమ్మల్ని చూసి ఇక్కడి వన్యమృగాలు బెదిరిపోతున్నాయి! మీ విశాలమైన భుజాలూ, ఏనుగుతొండాల వంటి చేతులూ చూస్తే, సమస్తమైన ఆభరణాలూ ధరించి, రాజ్యాలు ఏలదగినవారిలా ఉన్నారు," అన్నాడు.

రామలక్ష్మణులు మాట్లాడలేదు.

తిరిగి హనుమంతుడే ఇలా అన్నాడు:

"సుగ్రీవుడనే వానర రాజు మహా ధర్మాత్ముడు, గొప్ప బలశాలి. అన్న వెళ్ళ



గొట్టగా ఆయన చాలా ఇక్కట్లు పడుతున్నాడు. నేను ఆయన మంత్రిని, హనుమంతుడనే వానరుణ్ణి. సుగ్రీవుడు పంపగా ఋశ్యమూకం నుంచి వచ్చాను. నేను కోరిన రూపం పొందగలవాణ్ణి. అందుచేత ఈ బ్రహ్మచారి వేషం ధరించి వచ్చాను. ఎక్కడికైనా వెళ్ళగల శక్తి నాకున్నది. సుగ్రీవుడు మీ స్నేహం కోరుతున్నాడు.''

ఈ మాట వినగానే రాముడి ముఖం సంతోషంతో వికసించింది. రావణుడు ఎత్తుకుపోయిన సీతను తిరిగి సంపాదించటానికి వానరరాజైన సుగ్రీవుడి సహాయం పొందమని కబంధుడు రాముడికి చెప్పి ఉన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, ''తమ్ముడూ, వెదకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్టు, మనం చూద్దామనుకుంటున్న సుగ్రీవుడే మనకోసం తన మనిషిని పంపాడు. ఇతను చాలా బుద్ధిమంతుడుగా కనిపిస్తాడు. మాట్లాడుతున్నంతసేపూ ఇతని ముఖం చాలా నిర్మలంగానూ, నిష్కపటంగానూ ఉన్నది. ఇతనితో నువ్వు మాట్లాడు,'' అన్నాడు.

లక్ష్మణుడు హనుమంతుడితో, ''సుగ్రీవుడి సుగుణాలు మాకు తెలిసినవే. మేం ఆ సుగ్రీవుణ్ణే వెతుక్కుంటూ వస్తున్నాం. నువ్వు కోరినట్టే మేం సుగ్రీవుడితో స్నేహం చేసుకుంటాం,'' అన్నాడు.

రాముడికి సుగ్రీవుడి వల్ల ఏదో పని ఉన్నది; కాబట్టి రాముడు సుగ్రీవుడికి తిరిగి రాజ్యం వచ్చేటందుకు తోడ్పడ వచ్చునని హనుమంతుడు ఊహించి, సంతోషం పొంది, ''మీరిద్దరూ భయంకరమైన దండకారణ్యానికి ఎందుకు వచ్చారు?'' అని అడిగాడు.

రాముడు లక్ష్మణుణ్ణి తమ వృత్తాంతం చెప్పమన్నాడు. లక్ష్మణుడు ఇలా చెప్పాడు:

''ఇతను దశరథ మహారాజు పెద్ద కొడుకు, రాముడు. రాజు కావలసినవాడు. తండ్రి మాట దాటనివాడు. అలాటివాడు రాజ్యభ్రష్టుడై, నాతో కూడా

వనవాసం వచ్చాడు. మాతోబాటు ఇతని భార్య సీతాదేవి కూడా వనానికి వచ్చింది. నేను ఇతని తమ్ముణ్ణి. నా పేరు లక్ష్మ ణుడు. ఈ రాముడి గొప్ప గుణాలకు నేను దాసుణ్ణి. మేము లేని సమయంలో ఎవడో రాక్షసుడు ఇతని భార్యను అపహ రించి తీసుకుపోయాడు. వాడెవడో మాకు తెలియదు. ఆ రాక్షసుడి జాడ సుగ్రీవుడి ద్వారా తెలుస్తుందని మాకు మరొక రాక్షసుడు చెప్పాడు. అడిగావు గనక, మా సమాచారం దాచకుండా నీకు చెప్పాం. ఎంతటి వారికైనా శరణు ఇయ్యగల ఈ మహాపురుషుడు ఇప్పుడు సుగ్రీవుడి మైత్రి కోరుతున్నాడు. సుగ్రీ వుడు అంగీకరించాలి.''



దానికి హనుమంతుడు, ''మా రాజు సుగ్రీవుడే మిమ్మల్ని వెతుక్కుంటూ రావలిసిన పరిస్థితి. తన రాజ్యాన్నీ, భార్యనూ వాలి కాజేయటం చేత ఆయన చాలా విచారకరమైన స్థితిలో ఉన్నాడు. సీతాదేవిని వెతకటానికి ఆయన మీకు సహాయపడగలడు,'' అన్నాడు.

తరవాత అతను వారిని సుగ్రీవుడి వద్దకు రమ్మన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, ''మనం సుగ్రీ వుడి వద్దకు పోదాం. అతని సహాయం వల్ల మన కార్యం నెరవేరుతుంది,'' అన్నాడు.

వెంటనే హనుమంతుడు తన బ్రహ్మ చారి రూపం వదిలిపెట్టి, వానరరూపం ధరించి, రామలక్ష్మణులను తన భుజా లపై ఎక్కించుకుని, ఋశ్యమూక పర్వతం మీదికి వెళ్ళాడు. అయితే సుగ్రీ వుడు ఋశ్యమూకపర్వతం మీద లేడు; సమీపంలోనే ఉన్న మలయపర్వతం మీద భయంతో దాక్కున్నాడు.

హనుమంతుడు మలయపర్వతం మీద ఉన్న సుగ్రీవుణ్ణి కలుసుకుని, ''ఆ వచ్చిన వాళ్ళు రామ, లక్ష్మణులు. ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాళ్ళు. దశరథమహా రాజు కొడుకులు. రాముడు నియమం పాటించి అరణ్యవాసం వచ్చాడు. అతని



భార్యను ఎవడో రాక్షసుడు ఎత్తుకు పోయాడు. అందుచేత ఆ రాముడు నిన్ను శరణు జొచ్చాడు. అన్నదమ్ములయిన రామ, లక్ష్మణులు నీ స్నేహం కోరుతున్నారు. వీరిని చేరదీసి ఆదరించు,'' అన్నాడు.

ఈ మాట విని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. అతను అందమైన మానవుడి రూపం ధరించి, రామలక్ష్మణుల వద్దకు వచ్చి, ''మిమ్మల్ని గురించి హనుమంతుడు నాతో అంతా చెప్పాడు. రాజువైన రామా, నువ్వు నావంటి వానరుడి స్నేహం కోరటం నాకు ఎంతో గౌరవమూ, లాభదాయకమూనూ. నీకు నా స్నేహం కావాలంటే నా చేతిలో చెయ్యివేసి, స్నేహ ధర్మం నిర్వర్తించు,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుడి చేతిలో చెయ్యి వేసి, అతన్ని గాఢంగా కౌగలించుకున్నాడు. అప్పుడు హనుమంతుడు అరణి మధించి అగ్నిచేసి, ఆ అగ్నిని పూజించి, రాముడికీ, సుగ్రీవుడికీ మధ్యగా దాన్ని ఉంచాడు. రామ, సుగ్రీవులు ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి, అగ్నిసాక్షిగా సఖ్యం చేసుకున్నారు.

రాముడు సుగ్రీవుడితో, ''నువ్వు నాకు స్నేహితుడవయ్యావు. ఇక నీ దుఃఖమే నా దుఃఖం. నీ సుఖమే నా సుఖం,'' అన్నాడు.

సుగ్రీవుడు దట్టమైన ఆకులు గల ఒక మద్దికొమ్మ విరిచి, దాని పైన రాముడితో సహా కూర్చున్నాడు. లక్ష్మణుడు కూర్చోవటానికి హనుమంతుడు ఒక చందనవృక్షం కొమ్మ విరిచాడు.

తరవాత సుగ్రీవుడు తనకూ, వాలికీ మధ్య వైరం ఎలా వచ్చినదీ వివరంగా చెప్పాడు. అంతా చెప్పి అతను రాముడితో, ''వాలి భయంతో నేను కుంగిపోయి ఉన్నాను. నా భయం తొలగించు,'' అన్నాడు.

రాముడు వాలి సుగ్రీవుల వృత్తాంతమంతా విని, చిరునవ్వు నవ్వుతూ,

''స్నేహానికి ఉపకారమే ఫలం. నీ భార్యను కాజేసిన వాలిని నేను చంపుతాను,'' అన్నాడు.

సుగ్రీవుడు ఈ మాటకు ఎంతో సంతోషించి, ''రామా, నీ దయవల్ల నాకు నా భార్యా, రాజ్యమూ తిరిగి రావాలి. అందుకోసం నువ్వు వాలిని చంపే ప్రయత్నం చెయ్యి. సీతాదేవిని నేను నీకు తెచ్చి ఇస్తాను, ఆమె పాతాళంలో ఉండనీ, స్వర్గంలో ఉండనీ, నేను ఆమెను తెచ్చి ఇయ్యటం మటుకు నిజం. ఇప్పుడు నాకు జ్ఞాపకం వస్తున్నది—నేను చూసినది సీతే అయి ఉండాలి. ఆమె నన్నూ, నా వెంట ఉన్న నలుగురు వానరవీరులనూ చూసి, మా ముందు నగలమూట పడవేసింది. వాటిని దాచి ఉంచాను. వాటిని నువ్వు గుర్తించగలవేమో చూడు,'' అన్నాడు.

రాముడు ఆత్రంగా, ''మిత్రమా, వాటిని వెంటనే తెచ్చి నాకు చూపించు,'' అన్నాడు.

సుగ్రీవుడు లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీతాదేవి పైబట్టలో మూటగట్టి ఉన్న అందమైన ఆభరణాలను తెచ్చి రాముడి ముందు పెట్టి, ''చూడు!'' అన్నాడు.

రాముడు వాటిని చూస్తూనే, ''హా సీతా!'' అని పడిపోయి, కంట నీరు కార్చుతూ, నిట్టూర్పులు విడవసాగాడు. కొంతసేపయ్యాక అతను లక్ష్మణుడితో, ''లక్ష్మణా, రాక్షసుడు తనను తీసుకు పోయేటప్పుడు సీత ఈ నగలను మెత్తని గడ్డి గల ప్రాంతంలో పడవేసి ఉంటుంది. అందుచేతనే ఇవి చెక్కుచెదరకుండా ఉన్నాయి,'' అన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, ''ఈ కేయూరాలూ, కుండలాలూ, నేను గుర్తించలేను. కాని, సీత కాళ్ళకు రోజూ నమస్కరించేటప్పుడు కనిపించే ఈ అందెలను గుర్తించగలను,'' అన్నాడు.

రాముడు దీనంగా సుగ్రీవుణ్ణి, ''నువ్వు చూస్తూండగా ఆ రాక్షసుడు సీతను ఎటుగా తీసుకు పోయాడు?'' అని అడిగాడు.





# అదృశ్యకరణి

ఒకప్పుడు ఒక గ్రామంలో పరమనీచుడైన భూస్వామి ఒకడు ఉండేవాడు. బిచ్చగాళ్ళెవరూ అతని ఇంటి చాయలకు రావటానికి వీల్లేదు; వస్తే వాళ్ళను తిట్టి వెళ్ళగొట్టటంతో పోక, వాళ్ళు మళ్ళీ రాకుండా కుక్కలను వాళ్ళ మీదికి ఉసి కొల్పేవాడు.

ఒకసారి ఆ ప్రాంతాల తీవ్రమైన తిండి కరువు వచ్చింది. అలాటి కరువు ఎన్నడూ ఎరగరు గ్రామస్థులు. వాళ్ళు కడుపునిండా తింటే ఎలా ఉంటుందో కూడా మరిచిపోయారు. భూస్వామి వద్ద చాలా ధాన్యం ఉన్నదని వాళ్ళకు తెలుసును. కాని జనం ఎంత ప్రాథేయపడినా ఆ కర్కోటకుడి మనసు కరగలేదు.

ఆ పరిస్థితిలో ఒక యువకుడు ఆ భూస్వామి మనస్సు కరిగించి ధాన్యం తెస్తానని బయలుదేరాడు. వాడు భూస్వామి ఇంటి ముందున్న తోటలోకి ప్రవేశించి, ఒక ఎత్తయిన చెట్టు కింద కూర్చుని దీక్షగా చెట్టు కొమ్మలలోకి చూడసాగాడు.

భూస్వామి అప్పుడే భోజనం చేసి కిటికీ వద్దకు వచ్చి, బయటికి చూసేసరికి ఆకుర్రవాడు కనిపించాడు. వాడేదో దుర్బుద్ధితో వచ్చాడనుకుని భూస్వామి, "ఎవడ్రా అదీ? ఏం చేస్తున్నావక్కడ?" అని కేక పెట్టాడు.

యువకుడు ఆ కేకలేవీ వినిపించుకోకుండా అలాగే చెట్టులోకి పరీక్షగా చూస్తూ ఉండిపోయాడు.

భూస్వామి బయటికి వచ్చి, యువకుణ్ణి సమీపించి, "ఏమిటి అలా చూస్తున్నావని అడిగితే పలకవేం? చెవుడా?" అన్నాడు.

"మరేం లేదు. గూడు కోసం చూస్తున్నాను. నిన్న అగ్నిపక్షి ఈ చెట్టు మీద వాలటం చూశాను. ఇక్కడ ఆ పక్షి గాని గూడు పెట్టిందో, అందులో మంత్రపు మూలిక ఉంటుంది. మీకు మాత్రం

చీనా జానపద కథ

తెలీదా? ఆc! అదుగో గూడు!'' అన్నాడు యువకుడు.

''మంత్రపు మూలికా? ఏమిటా మంత్రం?'' అని భూస్వామి అడిగాడు.

"అదొకఅపూర్వమైనమూలిక. వెయ్యేళ్లకొకసారి పూస్తుంది. ఆ పూత కాయ కావటానికి మరో వెయ్యేళ్ళు పట్టుతుంది. కాని దాని చిన్న రెమ్మలో కూడా అద్భుతశక్తి ఉంటుంది,'' అన్నాడు యువకుడు.

''ఏమిటి దానికుండే అద్భుతశక్తి? ఆ మాట చెప్పవేం?'' అన్నాడు భూస్వామి చిరాకుగా.

''ఒకటేమిటంటే, దాని చిన్న కాడ తలలో పెట్టుకున్నా మనం అదృశ్యమై పోతాం. మనని ఎవ్వరూ చూడలేరు. అప్పుడు మనం ఏది పడితే అది చెయ్యొచ్చు ఇంకొకటేమిటంటే—''

అని యువకుడు చెప్పబోతుండగానే భూస్వామి, ''పో ముందు ఇక్కణ్ణుంచి!'' అని అరిచి హంగామా చేశాడు.

యువకుడు చుట్టూ చూసి, ''ఇక్కడెవరూ లేరే? ఎవరిమీద కేకలేస్తున్నారు?'' అన్నాడు తాపీగా.

''నిన్నే పొమ్మంటున్నాను. ఆ మూలిక నాది. ఇది నా తోట!'' అంటూ భూస్వామి మరింత గట్టిగా అరిచాడు.

''అలాగా? దాన్ని కనిపెట్టినవాణ్ణి నేను. దాన్ని ధ్వంసం చెయ్యటం నా చేతిలో ఉన్నది,'' అంటూ యువకుడు చెట్టెక్కనారంభించాడు.



"ఆగు! ఒక క్షణం ఉండు! నీకు యాభై బంగారు కాసులిస్తాను," అన్నాడు భూస్వామి.

"క్షమించాలి. దాన్ని అంత చవుకగా అమ్మలేను," అన్నాడు యువకుడు.

భూస్వామి బేరానికి దిగాడు.

"నాకు డబ్బు అవసరం లేదు. యాభై బస్తాల ధాన్యం ఇప్పిస్తే ఆ మూలికను మీకు వదిలేస్తాను," అన్నాడు యువకుడు.

భూస్వామి బలవంతాన ఒప్పుకున్నట్టు ఒప్పుకున్నాడు. యువకుడు ధాన్యం పట్టుకుపోయి దాన్ని గ్రామంలో ఉండే బీదకూ, బిక్కకీ పంచిపెట్టేశాడు.

ఈ లోపల భూస్వామి తన నౌకర్లచేత చెట్టుమీది నుంచి గూడు దింపించి, తన భార్య దగ్గిరికి పట్టుకుపోయి, "ఏం జరిగిందో చెప్పుకో!" అన్నాడు ఆనందంతో పొంగిపోతూ.

"నాకేం తెలుస్తుంది? ఎవడి నెత్తినో చెయ్యి పెట్టి ఉంటావు!" అన్నది భార్య.

"నువ్వు కనుక్కోలేవులే. ఒక మంత్రపు మూలిక సంపాదించాను. దానితో మనం అంతులేని డబ్బు సంపాదించుకుంటాం," అన్నాడు భూస్వామి.

అతని భార్య గూడు కేసి అనుమానంగా చూస్తూ, "ఇదేనా మంత్రపు మూలిక?" అన్నది. దాని నిండా పుల్లలూ, గడ్డిపోచలూ ఉన్నాయి.

"ఈ పుల్లలలో మంత్రపు మూలిక ఏదో మనం తెలుసుకోవాలి. నేను ఒక్కొక్కటే



నెత్తిన పెట్టుకుంటాను. ఎప్పుడు కనపడ కుండా పోతానో నువ్వు చెప్పాలి," అన్నాడు భూస్వామి.

అతను ఒక్కొక్క పుల్లే ఏరి నెత్తిన పెట్టు కోవటమూ, "నేను కనిపిస్తున్నానా?" అని అడగటమూ, అతని భార్య, "అహ, కని పిస్తూనే ఉన్నావు," అనటమూ చాలాసార్లు జరిగింది.

చివరకు భార్య విసిగి, "నాకేమీ కని పించటం లేదు, పో!" అని లేచి వెళ్ళి పోయింది. అప్పుడు తన నెత్తిన ఉన్నదే మంత్రపు మూలిక అనుకుని, దాన్ని తన జుట్టులో ఇరికించుకుని ఆ మూఢుడు నగరంలోకి బయలుదేరాడు.

వీధిలో పోతూండగా గుప్పునతినుబండా రాల వాసన తగిలింది అతనికి. తన సమీ పంలో ఉన్న దుకాణంలో నుంచి రెండు అట్లు తీసుకుని ఆవురావురున తినేసి ముందుకు సాగాడు.

దుకాణదారుకు భూస్వామి తెలుసు. భూస్వామి తొందరగా ఎక్కడికో పోతూ డబ్బులు ఇవ్వలేదనీ, తిరిగి వచ్చేటప్పుడు ఇస్తాడు లెమ్మనీ దుకాణదారు అనుకుని మాట్లాడకుండా ఊరుకున్నాడు.

తాను అదృశ్యంగా ఉండటం చేతనే దుకాణదారు డబ్బులు అడగలేదను కున్నాడు భూస్వామి. అంతటితో అతనికి మరింతధైర్యం వచ్చింది.

మరొక దుకాణంలో ఉండే వర్తకుడు దుకాణం మూసి వెయ్యబోతూ, ఆ రోజు వసూలయిన డబ్బంతా తన ముందు పోసు కుని, ఎంచి బొత్తులు పెడుతున్నాడు. ఆ డబ్బు చూసేసరికి భూస్వామి కళ్ళు తిరిగిపోయాయి. అతను దగ్గిరికి వెళ్ళి, చెయ్యిచాచిడబ్బంతా కాజెయ్యబోయాడు.

వెంటనే వర్తకుడు భూస్వామి చెయ్యి గట్టిగా పట్టుకుని, "దొంగ! దొంగ!" అని కేకపెట్టాడు. అన్ని పక్కల నుంచి జనం వచ్చిపడి, భూస్వామిని చచ్చేట్టు తన్నారు. చావుతప్పి కన్ను లొట్టపోయినట్టయి భూస్వామి పడుతూ, లేస్తూ ఇల్లు చేరు కున్నాడు.





# నేత్రదర్శి

శివపురం అనే ఊరికి నేత్రదర్శి అనే కొత్త వైద్యుడొకాయన వచ్చాడు. ఆయన రూపం, వస్త్రధారణా, మాటతీరూ ఊరి వాళ్ళను ఇట్టే ఆకర్షించాయి. తాను ఎంతోకాలం హిమాలయాల్లో నివసించి, అక్కడి సిద్ధులనుంచి ఒక కొత్తరకం వైద్యపద్ధతి నేర్చుకు వచ్చానని, ఆయన ఊరివారందరికీ చెప్పాడు.

ఈ వైద్యపద్ధతిలో రోగికి ఎలాంటి పరీక్షలూ వుండవు. కేవలం రోగి నేత్రాల కేసి కొద్దిసేపు చూసి వ్యాధి ఏమిటో తెలుసుకుని మందులు ఇవ్వడం జరుగుతుంది. నేత్రదర్శి అదృష్టమో లేక కాకతాళీయమో గాని, ఆయన దగ్గిరకు వచ్చేవాళ్ళలో చాలామందికి వ్యాధులు నయం కావడం జరిగింది. కొద్దికాలంలోనే నేత్రదర్శి చుట్టుపక్కల గ్రామాల్లో గొప్ప వైద్యుడుగా చెలామణీ కాసాగాడు.

ఆ ఊళ్ళోనే సత్యధర్ముడనే వైద్యుడొకాయన వున్నాడు. ఆయన తరతరాలుగా వైద్యమే వృత్తిగా గల కుటుంబంలో జన్మించినవాడు. బాల్యం నుంచి తాత తండ్రులవద్ద శ్రమించి ఎంతో శ్రద్ధగా వైద్యవిద్య నేర్చుకున్నవాడు. నేత్రదర్శి రాకతో ఆయన దగ్గిరకు వైద్యానికి వచ్చే వాళ్ళ సంఖ్య బాగా తగ్గిపోయింది.

రోగికి నాడిపరీక్షతో పాటు, ఇతర శారీరకమైన పరీక్షలు చేసి, వ్యాధి ఏమిటో నిర్ణయించడం సంప్రదాయంగా వచ్చే శాస్త్రీయపద్ధతి. అంతేగాని, కళ్ళను చూసి శరీరంలోని జబ్బులను తెలుసుకోవడం, ఎలా సాధ్యమో సత్యధర్ముడికి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

ఈ విషయం ఆయన ఊళ్ళోని ఒకరిద్దరు పెద్దలతో చెప్పాడు. ఈ సంగతి వాళ్ళ ద్వారా విన్న నేత్రదర్శి చిరునవ్వు

జి. సి. జీవి



నిజాయితీనీ, వైద్యపరిజ్ఞానాన్నీ స్వయంగా పరీక్షించాలనుకున్నాడు.

ఒకనాటి రాత్రివేళ సత్యధర్ముడు మారువేషం వేసుకుని, ఒక వృద్ధుణ్ణి చేయిపట్టుకుని నడిపించుకుపోయి, నేత్రదర్శి ఇంటి తలుపు తట్టాడు. నేత్రదర్శి వెంటనే తలుపు తెరిచాడు.

సత్యధర్ముడు ఆయనతో, "అయ్యా, ఈ వృద్ధుడు నాకు పినతండ్రి. ఇంత కాలంగా ఆరోగ్యంగా వుండేవాడు. కాని వారంరోజులుగా అన్నపానాదులుముట్టడం లేదు. పాలు తాగించినా, వాంతి చేసుకుంటున్నాడు. మాటా పలుకూ లేదు. తమరు ఈయనను పరీక్షించి మంచి మందు లిచ్చి వ్యాధి నయంచేస్తే—మరీ లేనివాణ్ణి కాదు గనక, తమకు తృప్తికలిగేలా డబ్బిచ్చుకుంటాను," అని చెప్పాడు.

నేత్రదర్శి అంతా విని పెద్దగా నవ్వి, "నేను, నా దగ్గిరకువచ్చినరోగినే, నీ బాధ ఏమిటని ప్రశ్నించను. అలాంటిది, రోగి వెంట వచ్చిన నువ్వు, అతడి వ్యాధిని గురించి ఇంతగా వర్ణించనవసరం లేదు. నాది నేత్రవైద్యం! హిమాలయాలంటే ఏమిటో తెలుసు గదా? మంచుపర్వతాలు. ఆ చలికోర్చి, ఎందరో సిద్ధులను సేవించి నేర్చిన వైద్యవిద్య నాది. ఏదీ, రోగిని ఆ చాప మీద పడుకోబెట్టు!" అన్నాడు.

నవ్వి, "మీ ఊరి పాతవైద్యుడు బహుశా ఊరు దాటి ఒక్క అడుగు వేయకుండా, కేవలం తాళపత్రాలు తిరగేసి, వైద్యశాస్త్రం క్షుణ్ణంగా తెలుసుననుకుంటున్నాడు! నేనలా కాక, బాల్యంలోనే హిమాలయాలకు వెళ్ళి, అక్కడి సిద్ధపురుషులకు ఎంతో కాలం శుశ్రూషలు చేసి, ఈ కొత్త వైద్యవిధానాన్ని నేర్చుకువచ్చాను. ఈనేత్ర వైద్యం నాతో అంతరించి పోకూడదు. ముందు ముందు సరిఅయిన శిష్యుడెవడైనా దొరికితే వాడికి నేర్పదలిచాను," అన్నాడు.

కొద్దికాలం గడిచింది. సత్యధర్ముడికి, నేత్రదర్శి వైద్యనైపుణ్యం మీద మరింత అనుమానం తలెత్తింది. ఆయన అతడి

సత్యధర్ముడు, వృద్ధుణ్ణి చాప మీద పడుకోబెట్టాడు. నేత్రదర్శి వృద్ధుడి కళ్ళ లోకి కొంతసేపు చూసి, చిన్నగా చిటిక వేసి, "నీ పినతండ్రికి జీర్ణకోశం చెడి పోయింది. ఊపిరితిత్తుల్లో ఒకటిమాత్రమే పని చేస్తున్నది. మెదడులోని కొన్ని నరాలు తెగిపోయాయి. అందువల్లనే, మాటా పలుకూ లేకపోవడం. తిన్నది జీర్ణం కాకపోవడం, వాంతులు చేసుకోవడం. నేను మామూలు వనమూలికలతో చేసిన మందులు కాకుండా, హిమాలయాల్లోని ఉత్తరప్రాంతపు శిఖరాల మీద మాత్రమే లభ్యమయ్యే మూలికలతో తయారు చేసిన మందులు ఇస్తాను. వాటిని వాడి చూడండి. మెదడూ, జీర్ణకోశమూ తిరిగి ఆరోగ్యవంతం కావడమే గాక, మాటాపలుకూ కూడా వస్తుంది," అన్నాడు.

ఆ వెంటనే వృద్ధుడు చాపమీది నుంచి చివాలున లేచి కూర్చుని, "నాకు మాటా పలుకూ ఇప్పుడే వచ్చింది! నీది రోగి కళ్ళను పరీక్షించి చేసే వైద్యమా? నేను పుట్టుగుడ్డిని. ఆ కళ్ళల్లోకి చూసి, నాకు లేని రోగాలన్నీ అంటగట్టావు. నేను గుడ్డి వాడినన్న సంగతే గ్రహించలేని నువ్వు వైద్యుడివా?" అన్నాడు.

ఆ మాటలు విని నేత్రదర్శి కంగారు పడిపోతూ ఏమో అనబోయేంతలో, సత్య ధర్ముడు, "అయ్యా, ఈనాటివరకూ మన ఇద్దరికీ పరిచయం లేకపోవడం మేలే అయింది. నేనీ ఊరి వైద్యుణ్ణి. నా పేరు సత్యధర్ముడు. ఇంతవరకూ మీరు చేసిన బూటకపు వైద్యంతో రోగుల ప్రాణాలు పోకపోవడం, మీ అదృష్టమో లేక వాళ్ళు చేసుకున్న పుణ్యమో అయి వుండాలి. బతుకుతెరువుకు అనేకమైన వృత్తు లున్నవి. మీరు వాటిల్లో దేన్నయినా చేపట్టి, నిజాయితీగా బతకండి. అంతేగాని బూటకపు వైద్యంతో మనుషుల ప్రాణాలతో మాత్రం చెలగాటమాడకండి," అన్నాడు.

నేత్రదర్శి క్షమించమని సత్యధర్ముడి పాదాల మీద పడి, ఆ రాత్రికిరాత్రే ఊరు విడిచి ఎటో వెళ్ళిపోయాడు.





# అతివినయం

సౌశీల్యదేశ రాజయిన సర్వోత్తముడికి, అంతఃపురంలోనే తనకు శత్రువులున్నారన్న సందేహం కలిగింది. అందుకు కారణం—అంతఃపురంలోని రహస్యాలు చాలా వరకు; తన పొరుగురాజైన దీర్ఘనిద్రుడికి తెలిసిపోతున్నాయి. దీర్ఘనిద్రుడు దుర్బలుడైనా, అవకాశం చూసుకుని దాడి తలపెట్టవచ్చునని అనుమానం కలిగింది.

సర్వోత్తముడు తన అంతఃపురంలోని ఉద్యోగులలో, శత్రుదేశానికి గూఢచారులుగా పనిచేస్తున్నవాళ్ళెవరో తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. కానీ ఆయన ఎంత పరిశీలించినా, అంతఃపుర ఉద్యోగస్థులందరూ, తనపట్ల సమాన గౌరవాన్నీ, భక్తినీ చూపిస్తున్నట్లే కనిపించింది. వాళ్ళ రాజభక్తిలో ఏమాత్రం తేడా కనిపించడం లేదు. వాళ్ళల్లోంచి శత్రువులను ఏరడం అన్నది, ఆయనకు పెద్ద చిక్కు సమస్యగా పరిణమించింది.

ఒక రోజున ఆయన ఎంతో సూక్ష్మబుద్ధి కలవాడని పేరు పొందిన ఆస్థాన విదూషకుడు ధరహాసుణ్ణి పిలిచి, తన సమస్య వివరించి, "ధరహాసా, ఏవిధంగానైనా సరే, అంతఃపుర ఉద్యోగస్థుల్లో కపట రాజభక్తిని కనబరుస్తున్న శత్రువులను కనిపెట్టాలి. ఆ బాధ్యత నీకు అప్పగిస్తున్నాను," అని చెప్పాడు.

అందుకు ధరహాసుడు, "ప్రభూ, అదెంత పని! తమరనుమానిస్తున్నట్టు నిజంగానే శత్రు గూఢచారులు అంతఃపురంలో వుండడం జరిగితే, వాళ్ళను క్షణాలమీద పట్టెయ్యగలను," అని వెంటనే అంతఃపుర ఉద్యోగులందరినీ, రాజుగారి సమక్షానికి రావలసిందిగా కబురు పంపాడు.

దాసరి వెంకటరమణ

ఉద్యోగు లందరూ వచ్చిన తర్వాత, ధరహాసుడు వాళ్ళతో, "దేశాన్ని పరిపాలించే రాజు నిత్యం ఎన్నో సమస్యలతో సతమతమవుతూంటాడని, మీకు తెలియంది కాదు. అలాంటి రాజుకు, అతి అరుదుగా లభించే కొద్దిపాటి సమయాన్ని నిశ్చింతగా గడపాలంటే, తనచుట్టూ తన మీద మంచి భక్తివిశ్వాసాలున్న ఉద్యోగులే వున్నారన్న నమ్మకం కలగాలి. మీవంటి సమర్థులూ, నిజాయితీపరులూ, రాజభక్తి గలవారూ అంతఃపుర ఉద్యోగులుగా దొరకడం, మన రాజుగారి అదృష్టం. అందుకు ఆయన మీకు రుణపడి వుంటారు! సరే, ప్రస్తుతానికి మీరందరూ రాజుగారి పాదాలకు మొక్కడమే కాక, పదిసార్లు ఆయన చుట్టూ ప్రదక్షిణం చేసి వెళ్ళండి," అన్నాడు.

ఆ మరుక్షణం, అక్కడికి వచ్చిన అరుగురు ఉద్యోగుల్లో ఇద్దరు ధరహాసుడు చెప్పినట్టే చేసి, పక్కకు వెళ్లి నిలబడ్డారు.

రాజు సర్వోత్తముడు, జరుగుతున్నదంతా మౌనంగా చూస్తూ వుండిపోయాడు.

ధరహాసుడు మిగిలిన ఉద్యోగులకేసి కోపంగా చూస్తూ, "మీ సంగతేమిటి?" అని అడిగాడు.

ధరహాసుడి ప్రశ్నకు వాళ్ళెవరూ జవాబివ్వకుండా, తలలు వంచి నేలచూపులు



చూస్తూ వూరుకున్నారు. ధరహాసుడు మరొకసారి రెట్టించి అడిగినా, వాళ్ళు మౌనంగా వుండిపోయారు.

ఈసారి ధరహాసుడు తీవ్రస్వరంతో, "ఎంతపొగరు! ఇప్పుడు మీరు నేను చెప్పినట్టు చేస్తారా లేక కొరత వేయించమంటారా?" అన్నాడు.

ఆ మాటలతో ఆ నలుగురు ఉద్యోగులూ వున్నచోటు నుంచి కదిలి, రాజుగారి పాదాలకు నమస్కరించి, ఆయన చుట్టూ ప్రదక్షిణ చేయబోయారు.

విదూషకుడు వాళ్ళను ఆగమని, రాజుతో, "మీకు మొదట పాదాలకు నమస్కరించి, మీచుట్టూ ప్రదక్షిణచేసిన

ఆ ఇద్దరు రాజోద్యోగులే, మీకు ద్రోహం తలపెడుతున్న శత్రువులు,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ, ''వాళ్ళు ద్రోహులని ఎలా రుజువుచేయగలవు?'' అన్నాడు.

దానికి ధరహాసుడు, ''ప్రభూ, కపట రాజభక్తిని ప్రదర్శించే వ్యక్తులు, తమ నిజస్వరూపం బయటపడకుండా కాపాడుకునేందుకు, నలుగురికీ తమ రాజభక్తి కనిపించేలా ఎన్నో చేష్టలు చేస్తూంటారు. వాళ్ళు ఏనాడూ రాజభక్తిని ప్రకటించుకునే అవకాశాన్ని వదలరు,'' అన్నాడు.

''మిగిలిన ఆ నలుగురి మాటేమిటి?'' అని ప్రశ్నించాడు రాజు.

''వాళ్ళు నిజమైన రాజభక్తిగలవాళ్ళు. అలాంటివాళ్ళకు తమ రాజభక్తిని నలుగురి ఎదటా ప్రదర్శించాలన్న కోరిక వుండదు. అంతేకాక—తమను గౌరవించడానికైనా, మీపట్ల రాజభక్తిని కనపరచడానికైనా, ఒక హద్దంటూ వుంటుంది. తమచుట్టూ ప్రదక్షిణ చేయమన్నానే—ఆ పని ఉన్నతవ్యక్తిత్వమూ, ఆత్మాభిమానం గల ఏ వ్యక్తీ చేయడు. అంతెందుకు—అతివినయం ధూర్తలక్షణం అని తమకు తెలియదా? ఇంతకు మించి నేను వివరించవలసిన అవసరం లేదనుకుంటాను,'' అన్నాడు విదూషకుడు.

రాజుకు, విదూషకుడు చెప్పినదాంట్లో నిజం వున్నదనిపించి, తన గూఢచారుల నాయకుణ్ణి పిలిపించి, ఆ ఇద్దరు రాజోద్యోగులనూ ప్రశ్నించి, వాస్తవం ఏమిటో తెలుసుకోమన్నాడు.

గూఢచారుల నాయకుడు, రాజోద్యోగులిద్దరినీ మరొక గదిలోకి తీసుకుపోయి, నిజం చెప్పకపోతే ఉరి తీయిస్తానని బెదిరించిన మీదట, వాళ్ళు తాము పొరుగు రాజైన దీర్ఘనిద్రుడి గూఢచారులమని ఒప్పుకున్నారు.

ఈ సంగతి గూఢచారుల నాయకుడి నుంచి విన్న రాజు, వాళ్ళకు దేశబహిష్కరణ శిక్ష విధించి, తన విదూషకుడి సునిశితబుద్ధిని మెచ్చుకుని ఘనంగా సన్మానించాడు.



సింహం గంటకు 40 మైళ్ళ వేగంతో పరిగెత్త గలదు. ఒక్క గెంతున 40 అడుగులు దాటగలదు.

మృగరాజు

అరణ్యంలోని సింహం జీవించడానికి వారానికి 108 కిలో గ్రాముల మాంసం తింటుంది!

జంతు సమూహం

చూడడానికి ఒక్క గొడుగులా కనిపించే బెండుజాతి నీటి మొక్క నిజానికి వందలాది జంతువుల సమూహం. వీటన్నిటిలోకి పెద్దది "ఫ్లోట్." ఇది 8 నుంచి 10 అంగుళాల పొడవు వుంటుంది. దీనిలోని ప్రాణులన్నిటిలోకీ విడి విడిగా ఆహారసరఫరా జరుగుతుంది.

న్యూయార్క్‌లోని 'బ్రోంక్స్‌జూ' జంతు ప్రదర్శనశాల 30 అడుగులకు మించిన పొడవుగల పామును తెచ్చిన వారికి 15,000 డాలర్లు బహుమతి ఇస్తామని 1920 వ సంవత్సరం ప్రకటించింది. అయినా, ఈనాటి వరకూ ఆ బహుమతిని ఎవరూ పొందలేకుండా వున్నారు!

బహుమతి!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



S. G. Seshagiri

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అన్వేషించే వయసు! రెండవ ఫోటో: ఆనందించే మనసు!

పంపినవారు: డా॥ ఎమ్. పట్టాభిరామారావు, అరండల్‌పేట, గుంటూరు—522 002.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

**చందమామ పబ్లికేషన్స్**, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.




1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....



1989
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదిహేనవ
సంవత్సరం....



